# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**

సంపుటి 11 | మే 1999 | సంచిక 5

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : 'లక్ష్మా గౌడ్ పెయింటింగ్'

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536
e-mail : misimi_m@hotmail.com
http : //www.misimi.com

సంపాదకుడు : అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

# A to Z cynic's guide to good lovers, women with depth

**- Abhik Sen**

What's the definition of a husband? "A man who's chiefly a good lover when he's betraying his wife," according to Marilyn Monroe. Or, what is the precise meaning of decolletage? By actress Zsa Zsa Gabor's definition, the only place men want depth in women.

Cynics, dismissed by the computer thesaurus and more conventional dictionaries as sceptics or those who refuse to believe in goodness, have now got together under one roof to prove that they are essentially in pursuit of the truth, with wit as a fellow traveller

For the A to Z of cynical quotes there is now *The Cynic's Dictionary*, published by Prion publishers It has just hit the stands here, Actor Marlon ••Brando sums up his kind by claiming an ""actor is a guy who, if you ain't talking about him, he ain't listening." The *Sun,* reproducing some definitions. quotes broadcaster Brian Johnston on babies: "Nine months' interest on a small deposit."

Echoing the thoughts of many, Sholom Aleichem defines Adam as "the luckiest man in the world - no mother-in-law." Excerpts, from A to Z from *The Cynic's Dictionary.*

- Adolescents: People who never seem to realise that one day they will be as dumb as their parents (Rev.James Simpson)
- Bore : A man who, when you ask him how he is, tells you. (Bert Leston Taylor)
- California : A fine place to live, if you happen to be an orange. (Fred Allen)
- Divorce : Fission after fusion. (Rita Mae Brown)
- Election : When the air is full of speeches... and vice-versa. (Peter Eldin)
- Fashions : Induced epidemics. (George Brnard Shaw)
- Gigolo : A fee-male. (Isaac Goldberg)
- Hangover : The wrath of grapes. (Jeffrey Bernard)
- Intellectual : A man who doesn't know how to part a bike. (Spiro Agnew)
- Journalism : a profession whose business it is to explain to others waht it personally doesn't under stand. (Lord Northcliffe)
- Knowledge : Power .... if you know it about the right person. (Ethel Watts Munford)
- Laziness : Riding a bike over cobblestones to knock the ash off a cigarette. (Les Dawson)

**CYNIC'S DICTIONARY**

- Make-up: What it takes to look natural, (Calvin Klein)
- Narcissist: Someone who's better looking than you. (Gore Vidal)
- Old age : A very high price to pay for maturity. (Tom Stoppard)
- Pedestrians : People who are knocked down by motor cars. (J.B. Morton)
- Quartet : Four men, all of whom think the other three can't sing. (Herbert Prochnow)

*(Continued on 153 )*

''ఆధునికు'' లకు మింగుడుపడని

# లక్ష్మా గౌడ్

– చలసాని ప్రసాదరావు

లక్ష్మాగౌడ్ పేరుకు ముందుగాని, వెనుక గాని ఎలాంటి విశేషణం అవసరం లేదు. ఆ పేరే ఒక విస్మరించలేని విశేషణంగా చిత్ర కళా రంగంలో స్థిరపడి ఉంది అతని కళ, దానిలో అంతర్గతమైన అతని అంతరంగం మేధావి వర్గంలో చర్చనీయాంశమైంది. అర్థం చేసుకొన్నవారు తక్కువ, అపార్థాలు తీసిన వారెక్కువ

ఇవెలా ఉన్నా, ఆధునిక చిత్రకళలో అంతర్జాతీయ స్థాయిలో సైతం తన చిత్రాలతో ప్రముఖ స్థానం దానంతటదే నెలకొనేలా వాటిని సాహసోపేతంగా తీర్చి దిద్దిన తెలుగువాడు లక్ష్మాగౌడ్. ఇప్పుడు కాదు, నాకు తెలిసినంతలో నాలుగేళ్ల నాడే న్యూయార్క్‌లో ఒక ప్రముఖ సంస్థ భారీ ఎత్తున జరిపిన తొలి భారతీయ కళాఖండాల ''వేలం'' లో యం. యఫ్ హుసేన్ చిత్రాలతో పాటు లక్ష్మాగౌడ్‌వీ హాట్‌కేక్స్‌లా అమ్ముడయి పోయాయి

నిజానికి లక్ష్మాగౌడ్ ఇపుడు క్రొత్తగా చేస్తున్నదేమీ లేదు కనీసం మూడు దశాబ్దాలుగా అతని ఆలోచనా రీతి, చిత్రిత కోణం ఇప్పుడున్నట్లే కొనసాగుతున్నాయి ఎవరికి నచ్చినా, నచ్చక పోయినా ఆ 'గతి' కీ 'రీతి' కీ దృఢంగా, నిజాయితీగా కట్టుబడి ఉన్న అతని పట్టుదలకు తగిన గుర్తింపు, అది కూడా గౌరవనీయ స్థాయిలో క్రమానుగతంగా పెంపొంది తిరుగు లేనిదిగా స్థిరపడిందీ నాటికి.

యాభై తొమ్మిదేళ్ల లక్ష్మాగౌడ్ నేటికి నలభయ్యొక్క సంవత్సరాల నాడు హైదరాబాద్, ప్రభుత్వ లలిత కళల, వాస్తుశాస్త్ర కళాశాలలో చేరే నాటికే అతని పెన్సిల్ అసంఖ్యాకంగా స్కెచ్‌లను సృష్టించి ఉంది. నా క్లాస్‌మేట్‌గా కళాశాలలోనూ, హాస్టల్‌లోనూ, బయట లాండ్ స్కేప్, లైఫ్ స్టడీ క్లాసులలోనూ నా కళ్లముందే వేలాది స్కెచ్‌లు గీశాడు. అతని పెన్సిల్‌కు గాని, కుంచెకు గాని విశ్రాంతి అనేదే లేదన్నట్లుగా 'కళ' కళాసాధన అతని జీవితంలో లీనమై పోయున్నాయి. మా తరంలో అలాంటి వారు చాలా మందే ఉండేవారు గానీ, ఇన్ని దశాబ్దాల తర్వాత కూడా ఆ ఊపు, ఆ మమేకత, తమ కళపట్ల ప్రగాఢ విశ్వాసం, నిలబెట్టుకొంటూ ప్రశాంతంగానే దూసుకుపోతున్న వారు అరుదు.

అందుకే ''లక్ష్మాగౌడ్'' అనే పేరు ఒక మనిషి, లేదా చిత్రకారుని పేరుగా కాక, ఆధునిక చిత్రకళలో ఒక సంచలనాత్మక సృష్టికి ప్రతీకగా విఖ్యాతమైంది అదలా స్థిరపడి పోయింది.

లక్ష్మాగౌడ్ పుట్టి పెరిగింది హైదరాబాద్‌కు నలభై మైళ్లలో నున్న 'నిజాంపూర్' అనే కుగ్రామంలో, కల్లు గీత పనివారి కుటుంబంలో. ఆ గ్రామ వాతావరణం, ప్రకృతిలోని స్వచ్ఛతలే గాక, అక్కడి మనుషుల నిత్య జీవితంలోని అలవాట్లు, ఆచారాలు అన్నీ అతని మనసులో బాల్యంలోనే ముద్రించుకు పోయున్నాయి, జ్ఞాపకాలుగా. హైదరాబాద్ వచ్చిన తర్వాత, నగర జీవన ''సంస్కారం'' అని మనం అనుకునే కృత్రిమ స్వభావాల పరిచయంతో ఆ గ్రామీణ సంస్కృతి, లేదా సంస్కారం ఎంత స్వచ్ఛమైనదో మరింతగా గ్రహించాడతను. నాగరీకులకు అనాగరికంగా అనిపించే అలవాట్లు, ప్రవర్తనలు, ముఖ్యంగా సెక్స్ సంబంధాలు అతని కళపై తీవ్ర ప్రభావం చూపించ సాగాయి.

వేలాది స్కెచ్‌లు, చిన్నవీ, పెద్దవీ వందలాది పెయింటింగులు వేశాక 1963లో చిత్రకళలో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ కోసం బరోడా యూనివర్సిటీలో చేరాడు లక్ష్మాగౌడ్ అక్కడి ఆధ్యాపకుడు కె జి సుబ్రహ్మణ్యం ఆధ్వర్యంలో సాంప్రదాయిక కుడ్య చిత్ర రచనలో శిక్షణ పొందుతూనే, తనకు అలవాటైన ధోరణిలోనూ చిత్రిస్తుండేవాడు, ఆధునిక చిత్ర కళారీతులనూ అధ్యయనం చేశాడు ఆదశలోనే చిత్రకళలో ప్రధానమైన అంశం ''స్వీయ దృక్పథం'', అనీ అది రూపొందవలసింది జీవితం నుండి అనే అంశాన్నెత్తి చూపారు కె. జి సుబ్రహ్మణ్యం, లక్ష్మాగౌడ్ చిత్రాల్లోని వ్యక్తిత్వాన్నీ, అతని అన్వేషణా తృష్ణనూ అర్థం చేసుకుని. ఫలితంగా బాల్యం నుండీ తనలో ముద్రితమై పోయున్న ఆ జీవితాన్ని మరోసారి సన్నిహితంగా అవగతం చేసుకునేందుకు స్వగ్రామం చేరాడు, లక్ష్మాగౌడ్

అక్కడి ప్రకృతిని, చెట్లు, కొండలు, మేకలు, ఆవులు, గేదెలు, మనుషులు, ఆ మనుషుల జీవితాల్లోని అప్యాయతలు, ఆత్మీయతలు, ప్రకృతితో, పశు పక్ష్యాదులతో వారికున్న అనుబంధాలు అవన్నీ అతనంతకుముందే అసంఖ్యాకంగా చిత్రించి ఉన్నాడు. ఇపుడు ఆ జీవితంలోని మరోకోణాన్ని, మరెవరూ స్పృశించ సాహసించని 'సెక్సు' కోణాన్ని తన దృష్టి, దృక్పథాల నుండి గ్రహించి కళలో ప్రతిఫలింపజేయ సాగాడు.

''అందగత్తెల సాన్నిహత్యము కోరి, చిత్రలేఖన విద్య నేర్చితిని నేను ...'' అన్నాడు గాలిబ్.

''అంద - ఆనందాల అర్థమ్ము చూపదలచి ఆశ్రయించితి చిత్ర లేఖమును నేను...'' అన్నట్లు లక్ష్మాగౌడ్ మరో కోణం నుండి శరపరంపరగా చిత్రాలు సృష్టించసాగేడు.

''సెక్స్'' అనేది మానవ జీవన మూలం. అది లేనిది ఈ జగత్తే లేదు. జీవితానంద హేతువుల్లో అది ఒక ముఖ్య భాగం. పల్లెవాసుల్లో ఉన్నంత సహజంగా పట్నవాసుల ''సంస్కారయుత'' జీవనంలో లేదని. ఇది ఓ కృత్రిమ విలువల సమాజం. సెక్స్ విషయంలో మనిషి మనిషిలా గాక, నిమిత్త మాత్రునిలా, మళ్లీ మాట్లాడితే పశువుకన్నా అన్యాయంగా మారాడు. దానికి 'సంస్కారం' అనే ఓ ముసుగు కప్పుకున్నాడు...

ఆ ముసుగును చీల్చి, అసలు మనిషిని, ఆధునిక సెక్సు జంతువును ప్రదర్శించటం నా కళ లక్ష్యం...

... అని లక్ష్మాగౌడ్ అన్నాడో లేదోగానీ, అతని కళలోని మూల స్వభావ, స్వరూపాల్ని విశ్లేషిస్తే కనుపించేదిదే!

సర్వసాధారణ గ్రామీణ మహిళల రూపాల్లోని అద్భుత సౌందర్యాన్ని అతనెంత అసాధారణంగా చూపించాడో, అంతే అసాధారణంగా ఈ సెక్స్ జీవన కోణాల్ని అదే పెన్సిల్, పెన్, బ్రష్‌ల నుండి నిర్భీతిగా జాలు వార్చాడు.

ఆ నిర్భీతే అతన్ని ''లక్ష్మాగౌడ్''గా నిల బెట్టింది.

''ఏ యువతి అయినా నా దృష్టిలో ఓ గ్రంథం లాంటిదే! అది తెల్ల కాగితాల మీది నల్లక్షరాల పుస్తకం కాదు, రక్త మాంసాల సజీవ గ్రంథం. నేనది నిత్యం పఠి ంచేను. ప్రతిసారీ అది నాకు నిత్య

నూతనంగా అనిపిస్తూ, నూతనానుభూతుల్నందజేసింది! ప్రతి పుటా ఒక క్రొత్త కథను విప్పి చెప్పింది అది మరి దేనితోనూ పోల్చలేనిది దాన్నర్థం చేసుకోవాలన్నా, అనుభూతి చెందాలన్నా సాధ్యమైనంత నిదానంగా, సున్నితంగా వ్యవహరించాల్సి ఉంది '' అని ఓ సందర్భంలో వివరించాడు, లక్ష్మాగౌడ్!

చిత్రకళలో సెక్స్ గురించి చర్చించే మేధావులు బాధపడేది సెక్స్ గురించికాదు దాన్నంత బాహాటంగా ప్రదర్శించినందుకే. వీళ్లే మళ్లీ సినిమాల్లో ముద్దుల గురించి గొంతు చించుకుంటారు. సెన్సార్ షిప్ గురించి సెమినార్లు జరుపుతారు . దేవాలయ కుడ్యాల మీద కామసూత్రాలకు ప్రాణప్రతిష్ఠచేసిన ఖజురహో శిల్పాలను ఆకాశానికెత్తగలరు ''ఖజురహో ఫెస్టివల్'' అంటూ అంతర్జాతీయ స్థాయిలో ప్రచారం చేసి విదేశీయుల్నొచ్చి చూసివెళ్లమనీ బ్రతిమాలుతారు, డాలర్ల కోసం...'' అని కూడా ఎద్దేవా చేయగల నిర్భీతి లక్ష్మాగౌడ్‌ది.

సెక్స్ విషయంలో స్త్రీ విషయంలో ఉండవలసినంత ఆత్మీయంగా గాక అవసరార్థ పదార్థంగానే అమెను భావించుకుని, అలాగే వ్యవహరిస్తున్నాడు, పురుషుడు. అందుకే లక్ష్మాగౌడ్ చిత్రాల్లో స్త్రీ మీదికి ఎగబడే పురుషుల్లో మృగఛాయలు స్పష్టంగా ప్రతిఫలిస్తుంటాయి.

ఈ విషయాన్నర్థం చేసుకోకుండా లక్ష్మాగౌడ్ వ్యక్తిత్వంలోని వైపరీత్యానికి చిహ్నంగా అతని చిత్రాల్ని భావించే వారున్నారు. కాని, వాస్తవంలో ఆ వైపరీత్యం అనేది లక్ష్మాగౌడ్‌లో లేదు. అతని చుట్టూ గల సమాజంలోనే, దాని స్వభావంలోనే ఉంది. ఆ స్వభావాన్ని భరించలేని, సహించలేని ఓ కళా హృదయుని ఆవేశపూరిత ఆలోచనల్లోంచి అతని కళలోకి ప్రవహించిందా కృత్రిమ విలువల పట్ల గల అసహనం. అందులో ప్రతిఫలించే వాస్తవాన్ని జీర్ణం చేసుకోలేక పోయినా, మింగక తప్పని పరిస్థితుల్లో వారు మౌనంగా ఊరుకోవాల్సి వచ్చింది.

కళా రంగం మాత్రం అతన్ని ఆకాశానికెత్తింది అతని నిర్భీకతను ప్రశంసించింది. తన భావాల వ్యక్తీకరణలో చూపిన చిత్రణా సామర్థ్యాన్ని, నేర్పును, కళాత్మకతను గుర్తించింది. అతని పేరు దేశమంతటా విస్తరించి, విదేశాలకు ప్రాకింది.

''ఒక కళా కారునిగా సమాజాన్ని మార్చటం నా లక్ష్యం కాదు. ఏ కళా కారుడైనా తన స్వీయ లక్ష్యాన్నే కళలో చూపగలగాలి...'' అని దాదాపు రెండున్నర దశాబ్దాల నాడే తన లక్ష్యాన్ని ప్రకటించాడు, లక్ష్మాగౌడ్.

ఆ అవగాహనే, ఆ స్పష్టతే అతన్ని ''లక్ష్మాగౌడ్''గా నిలబెట్టింది.

దేశంలోని అనేక ఫైన్ ఆర్ట్స్ కాలేజీలూ, యూనివర్శిటీల కళా విభాగాలు అతన్ని ఆహ్వానిస్తుంటాయి గౌరవాధ్యాపకునిగా, పరీక్షా సమయాలలో కళాఖండాల విలువల నిర్ణేతగా!

హైద్రాబాద్, సెంట్రల్ యూనివర్సిటీలోని సరోజినీ నాయుడు పేరునగల కళల విభాగంలోని పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్ అధిపతిగా అతని పర్యవేక్షణలో ఎందరో యువచిత్ర కారులు తమ కళకు మెరుగులు దిద్దుకున్నారు, దిద్దుకొంటున్నారు.

తెలుగు వారు ఎక్కడికి వెళ్లినా ''మా వాడే'' అని సగర్వంగా చెప్పుకోదగిన విఖ్యాతుడు లక్ష్మాగౌడ్.

# కవీ - రాజకీయవాదీ

(1959 నోబెల్ పురస్కార స్వీకారోపన్యాసం)

మూలం: సాల్వటోర్ క్వాసిమొడో                    అనువాదం : బి. వెంకట రామిరెడ్డి

''వెలుగు చూడని రాత్రి సుదీర్ఘమైనది'' - అన్నాడు షేక్స్పియర్ తన 'మాక్బెత్' నాటకంలో - అవే మాటలు కవి యొక్క స్థితిని వివరించడానికి ఉపయోగిస్తాయి కవికి అతని ఏకాంతంలో పాఠకుడు తన బాల్యస్నేహితుడి ముఖకవళికలతో, ప్రాపంచికమైన ముఖంతో దర్శనమిస్తాడు

కవి తన కవిత్వం ద్వారా అధిక సంఖ్యాకులైన మనుషులతో మాట్లాడాలనీ, వారితో కలిసిపోవాలనీ ఆశిస్తాడు కవి యొక్క బాల్యమిత్రుడు అతని తొలి కవితల లయకు గుర్తు కవి యొక్క ఇతర మిత్రులు ప్రాచీన కవులు. వారు కవి రచనలను అసుదూర తీరాల నుండి తిలకిస్తారు. ఆ ప్రాచీన కవుల కవితా రూపాలు శాశ్వతమైనవి అంతకన్న కొత్త రూపాలను సృష్టించడం కష్టతరం.

రచయితా, నవలాకారుడూ మనుషుల్ని అనుకరిస్తారు. కవి మాత్రమే అనంతమైన వస్తువులను ఆవిష్కరించగలుగుతాడు. అందుచేతనే ప్రతి కవి పుట్టుకా ఆ కాలపు సంస్కృతీ నియమాలను ప్రశ్నిస్తుంది. అలాగ అతనికి విమర్శకులు, మహా మహోపాధ్యాయులు, పండితుల్ని ఎదుర్కొనే పరిస్థితి ఏర్పడుతుంది. కవి యొక్క యౌవన కాలంలో వీరిలో అధిక సంఖ్యాకులు అతని అధిభౌతికాలను నాశనం చేసి, అతని ఊహా చిత్రాలను సరిదిద్దుతారు.

కవియొక్క బాహ్య వ్యక్తిత్వాన్ని అతని కవిత్వం నించి వేరు చేయలేం. ప్రతి దేశానికీ, ప్రతి శతాబ్దంలోనూ, మేధావి వర్గం ఉంటుంది. వీరికి వారివారి భావనా రూపాలుంటాయి. వాళ్ళ ఆదర్శవంతమైన రూపాలూ, నమ్మకాలూ ఉంటాయి. వారికి కవిత్వ చరిత్ర అంటే ఆత్మల పరంపర

1930లో నా మొదటి సంకలనం ప్రచురించబడ్డ నాటినించీ, ఆ తరువాత రెండవ, మూడవ, నాలుగవ సంకలనాలు ప్రచురించబడ్డాక, విభజించబడ్డ సంఘమూ, పాఠకులూ రాజకీయ ధూళిపొరల్లోంచి కఠినమైన కవిత్వాన్ని చూశారు. నేను 1940లో ప్రచురించిన ''గ్రీకు గేయాలు'' సాహిత్యంలోకి కొత్తదనాన్ని తీసుకొచ్చి యూరోపు అంతటా ప్రాచీన కావ్యాలను మళ్ళీ చదివింపజేశాయి. యువకులు తమ ప్రేమలేఖల్లో నాగేయాలను ఉటంకించారు. రాజకీయ నేరస్తులు జైలు గోడల మీద నాగేయాలని వ్రాశారు. కవిత్వానికి గొప్ప కాలం అది!

ఆ కాలంలో నాకవిత్వాన్ని పఠించిన వాళ్ళంతా మేధావులు. గెలిచినా, ఓడినా యుద్ధం మనుషుల స్థాయిని మార్చివేస్తుందని నేనెప్పుడో చెప్పాను. కవిత్వాలూ, తత్త్వాలూ అన్నీ తుడిచిపెట్టుకుపోతాయి. మృత్యు ప్రభంజనం తరువాత నీతి సూత్రాలూ, మత నమ్మకాలూ ప్రశ్నించబడతాయి. మేధావులు కవిత్వపు అశాంతి నించి తమని తాము దాచుకుంటారు. తన ఏకాంతం లోంచి కవి తన డైరీని ప్రారంభిస్తాడు. చీకటిమైదానం లోంచి సంభాషణ ఉద్భవిస్తుంది. రాజకీయవాదీ, మామూలు కవులూ

తమ ప్రతీకలతో అసలు కవిని పట్టించుకోవడం మానేస్తారు. అదొక కథలాగ పునరావృతం అవుతూవుంటుంది

దేనికీ కట్టుబడని కవి ఈకృతకమైన కవిత్వపు డొల్లల్ని పగలగొట్టాడు. అతడు గేయం నుండి కావ్యానికి ప్రవసిస్తాడు, ప్రపంచాన్ని విశ్లేషిస్తాడు అప్పుడు కవి ప్రమాదకారి అవుతాడు. రాజకీయవాది సాంస్కృతిక స్వేచ్ఛను, కవిత్వాన్ని విమర్శించడం మొదలుపెడతాడు. కవితా సృజన ప్రయోజన రహితం అనుకుంటాడు.

కవి తన కాలపు మనుషుల సమస్తానుభవాల సంగ్రహరూపం. అతనిభాష స్థిరమైనది. డాంటే భాష మామూలు భాషకు స్వచ్ఛమైన రూపం అన్నాడు ఎలియట్ డాంటే సామాన్యమైన భాషను కవిత్వీకరించాడు. అలాంటి అధికారాన్ని భాష మీద సాధించడం కష్టతరం. భాషా శాస్త్రకారులు భాష రచనా రూపాన్ని తయారుచేయలేరు. కవిభాష భాషా శాస్త్రకారుల భాషకు విరుద్ధమైనది భాష యొక్క రచనా రూపాన్ని శాసించే సత్తా కవికే ఉంది. కవి భాష అతని యొక్క భావనాబలం వల్ల సంశ్లిష్టమౌతుంది. కవులను అనువదించవచ్చు కాని పండితుల్ని అనువదించడం సాధ్యంకాదు. పండితులు మేధో విన్యాసాలను ఉపయోగించి ఇతర కవుల పద్ధతులను అనుకరించే ప్రయత్నంచేస్తారు. కవి తన సంప్రదానికే కట్టుబడి ఉంటాడు. అతడు విశ్వాంతరీకరణమ ప్రక్కకునెట్టేస్తాడు. పండితులు ప్రపంచమంతటా ఉన్న కవిత్వమంతా ఒకేవిధమైనది అనుకుంటారు. అందుకే వాళ్ళు కవిత్వాన్ని తమ చిన్న కొలబద్దలతో కొలిచి విలువల్ని నిర్ణయించే సంకుచిత ప్రయత్నం చేస్తారు. పండితులు తాము మాత్రమే నిజమైన ప్రపంచంలో నివసిస్తున్నామనుకునే సమయంలో, కవి వాక్కు మనుషుల హృదయాలను తడుతూ ఉంటుంది. అతడు సమకాలీన ఆధ్యాత్మిక స్థితిని ఆకళింపు చేసుకోలేడు. సాంస్కృతిక ఐక్యత, మత శక్తులు మనిషిని మేధో బానిసగా తయారు చేసేందుకు వొత్తిడి చేస్తాయి.

మత కవిత్వం, సామాజిక కవిత్వం, గేయ కవిత్వం, నాటక కవిత్వం - అన్నీ మనిషి వ్యక్తీకరణ రూపాలే. మనిషి వ్యక్తిగతమైన ఆధ్యాత్మిక విజయమే సమాజం అనుకోవడం పొరబాటు. ఒక మనిషి వల్ల, మరోమనిషి సన్యసిస్తే అది మృత్యు సిద్ధాంతం అవుతుంది. నిజమైన సృజన శక్తి ఎప్పుడూ తోడేళ్ళ పంజాల్లో పడుతుంది. కవి యొక్క భాషణం తరచూ బానిసీకరించబడ్డ ప్రపంచపు ఆధ్యాత్మిక స్వేచ్ఛ మీద ఆధారపడుతుంది. కవి మృత్యువుకు భయపడడు, ఎందుకంటే మృత్యువు ఎల్లప్పుడూ అతని ఆలోచనలను సందర్శిస్తూనే ఉంటుంది. దానితో అతడు పవిత్రమైన సంభాషణ చేస్తుంటాడు. అతడు మనిషిని అతని కలలు, రోగాలు, పేదరికపు బాధలు మొదలైన వాటి రూపంగా భావిస్తాడు.

రాజకీయవాది, మతం - వీరిద్దరి అధికారం కావ్య యుగం తరువాత ఒక సాహస్రాబ్ది వరకు చెలామణి అయింది. మామూలు విమర్శ కళారూపాల బాహ్య విషయాల మీద దాడిచేస్తుంది. కవి మాత్రం

తన నీతి నుండీ, సౌందర్య దృక్పథం నుండీ ప్రక్కకు తప్పుకోడు. అందుకే కవి లోకంలోను, సాహితీ లోకంలోను ఒంటరివాడే.

అయితే సమకాలీన సౌందర్య తత్త్వం అనేది వొకటుంటుందా? స్థితివాద, మార్క్సిస్టు కవిత్వాలింకా సాహిత్యంలోకి రాలేదు. ఇలాంటి సందిగ్ధ పరిస్థితుల్లో రాజకీయవాది కవిత్వానికి స్థిరత్వాన్నిస్తున్నట్లు భ్రమింపజేస్తాడు. కవికీ, రాజకీయవాదికీ మధ్య సంఘర్షణ అన్ని సంస్కృతుల్లోనూ ఉన్నదే. ప్రస్తుతం ప్రపంచాన్నేలే ఈ రెండు గ్రూపులూ సమకాలీన స్వేచ్ఛా సిద్ధాంతాలను రూపుదిద్దాలని చూస్తున్నాయి. రాజకీయవాది చెప్పే స్వేచ్ఛా సిద్ధాంతం కేవలం ఒకే మార్గం, సాంస్కృతిక చరిత్రను రక్తసిక్తం చేసిన ఈ గోడను పగలగొట్టడం కష్టతరం.

కవీ, రాజకీయవాదీ సహకరించుకోగలరా? ఇంకా పూర్తి వికాసాన్ని పొందని సమాజాలలో అది సాధ్యమేమో కాని సంపూర్ణ స్వేచ్ఛా సమాజంలో అది సాధ్యంకాదు. సమకాలీన సమాజంలో రాజకీయవాది అనేక మార్గాలవలంబిస్తున్నాడు. కాని కవి రాజకీయవాదిలా కాక మనిషి అంతర్ ప్రపంచాన్ని గురించి పట్టించుకుంటాడు. మనిషి అంతర్ ప్రపంచాన్ని సంస్కరించి నూతన సమాజ నిర్మాణం చెయ్యాలనే తపన కవిది.

మత శక్తి తరచుగా రాజకీయ శక్తితో చేతులు కలుపుతుంది. కవి ఎప్పుడూ తన ప్రజల నీతికి భారమితిలాగ ఉండడం రాజకీయవాదికి ప్రమాదంగా పరిణమిస్తుంది. డాంటే కవిత్వం దీనికి గొప్ప ఉదాహరణ. డాంటే కవిత్వంలోని గొప్పదనం ఆకాలంలో అనుమానాలను రేకెత్తిస్తుంది. ప్రతిదేశంలోను డాంటేలాగ సాంస్కృతిక ప్రతినిధిగా నిలబడే కవులు ఉంటూనే వుంటారు. జర్మనీలో స్కిల్లర్, ఇంగ్లండులో షేక్స్పియర్, ఫ్రాన్స్‌లో మోలియర్, కార్నీల్, స్పెయిన్‌లో సెర్వాంటిస్, రష్యాలో డోస్టలిస్కీ అలాంటి పాత్రే నిర్వహించారు.

సామాజిక ప్రగతిలో కవిపాత్ర ఏమిటో అందరికీ తెలుసు. ఫ్రాన్సులో ఒక జీవన విధాన నిర్మాతలుగా ఒక బోదిలేర్, ఒక మలార్మె, ఒక రింబాడ్ ప్రాముఖ్యతను సమకాలీనులు ఎరుగుదురు. సమాజంలో కవి నిర్వహించే ప్రధానపాత్ర రాజకీయవాదికి తెలియదు.

సృజన శక్తిని ఎప్పుడూ ఒక అంటు జాడ్యంగానే భావించారు. ప్లేటో తన ఆదర్శ రాజ్యంలో కవులను చేర్చలేదు; ఎందుకంటే కవులలో ఒకరకమైన అనిశ్చలత ఉంటుంది కాబట్టి. ప్రస్తుత కాలంలో కవి స్వేచ్ఛగా ఉన్నాడా? రాజకీయవాది కవికి ప్రసాదించే స్వేచ్ఛ ఆయుధాల్లేకుండా సైనికుడికి తన సమాజంలోకి కల్పించే ప్రవేశంలాంటిది. లియోనార్డో డావించి, అరిస్టోటస్లో లాంటి వాళ్ళిందుకు ఉదాహరణ.

అయితే రాజకీయ వాదైనా స్వేచ్ఛగా ఉన్నాడా అంటే అదీ లేదు. సమాజాన్ని ఏకట్టుబాట్లలో

ఉంచాలని అతడు ప్రయత్నిస్తాడో, అవే అతన్నీ బంధిస్తాయి. ఆవిధంగా చరిత్రలో రాజకీయవాది, కవి ఇద్దరి మధ్యా ఎడతెగని ఘర్షణ. యుద్ధమో, విప్లవమో సంభవిస్తేనే గాని శాంతి వుండదు. విప్లవం ఒక కొత్త సమాజాన్ని స్థాపిస్తుంది. యుద్ధం అనిశ్చిత స్థితిని మిగులుస్తుంది.

చివరి ప్రపంచ యుద్ధం రాజకీయ, పరిపాలనా వ్యవస్థల మధ్య జరిగిన సంఘర్షణ దాని హింస అతి చిన్న స్వేచ్ఛల్ని కూడా చిన్నాభిన్నం చేసింది. ప్రతి దేశపు సాంస్కృతిక వారసత్వమూ దాని సైనిక కార్యకలాపాలకు దూరంగా ఉంటుంది. భయం, అశక్తత, అలసత్వం లాంటివేవీ కవిని తన బాధ్యత నుండి తప్పించలేవు. ప్రతి కవీ, ఎప్పుడూ, ఎవరినో శిక్షించేందుకు తన పదాలను ఉపయోగించడు. అతని న్యాయం ఎప్పుడూ సృజన శిక్షణకు సంబంధించినది.

వ్యతిరేకత అనేది గతానికీ, వర్తమానానికీ మధ్యజరిగే ఘర్షణ. మృత్యువు స్వయం నిద్రా సుషుప్తిని కలిగి ఉంటుంది. దాన్ని తర్కంతోనో రాజకీయపు తెలివితేటలతోనో నిద్ర లేపేందుకు ప్రయత్నించడం అమానుషం. కవిత్వం అన్యాయానికీ, మారణహోమానికీ తల వొంచదు. రాజకీయవాది మనుషుల్ని ధైర్యంగా చచ్చిపోవడం నేర్చుకోమంటాడు. కవి మనుషుల్ని ధైర్యంగా బ్రతకమంటాడు. కవికి రాజకీయవాది శక్తి తెలుసు. రాజకీయవాదికి కవి యొక్క గొంతు సంఘపు అడుగు నుండి వినిపిస్తుంది. అప్పుడే కవికీ, రాజకీయవాదికీ మధ్య ఘర్షణ ప్రారంభమవుతుంది. చరిత్రలో బహిష్కృతులైన కవుల పేర్లని పావులుగా వాడతారు. రాజకీయవాది సంస్కృతిని పెంపొందిస్తున్నా నంటూ సాంస్కృతిక శక్తిని ధ్వంసం చేస్తుంటాడు. అతని ప్రయత్నం ఎప్పుడూ మనిషి ప్రాథమిక హక్కుల్ని హరించడమే. శాస్త్ర సంకేతాలయిన రేడియో, టి.వి. ల సాయంతో కళల ఐక్యతను విడగొడు తుంటాడు. నా ''అకిలస్'' గేయంలో నేను చెప్పిందదే. ఈ మధ్య నేను వ్రాసిన పుస్తకంలో మనిషిని భూమితో పోల్చాను.

సామాజిక ఐక్యత తాత్కాలికమైనది. ఏ నియంత జులుంలోనో తమ ప్రాథమిక హక్కుల్ని కోల్పోయిన ప్రజలు ఐక్యతతో నియంతృత్వాన్ని ఎదుర్కుంటారు. నియంతృత్వం తొలగిపోయాక మళ్ళీ ఎవరికి వారే అయిపోతారు. కవి తన చుట్టూ ఎత్తైన అసహనపు గోడను నిర్మించుకుంటాడు. అలా తను నిర్మించుకున్న శిఖరం మీది నించి ప్రజల మనసుల్లోకి ప్రవేశిస్తాడు.

కవి యొక్క నిశ్శబ్ద ఆక్రమణ అన్ని దేశాల మానవ చరిత్రల్లోనూ ఉన్నదే. రాజకీయవాదిని అంటిపెట్టుకుని వుండే మేధావి దేశానికి ప్రతినిధి కాలేడు. అలాంటి వాళ్ళు కవి యొక్క సందేశాన్ని ప్రజలకు చేరనీయకుండా కొద్దికాలం మాత్రమే అడ్డుపడగలుగుతారు లియోనార్డో డావించి చెప్పినట్లు, సకాలంలో ప్రతి తప్పు సవరించబడుతుంది.

## జీవితచరిత్ర

సాల్వటోర్‌క్వాసిమొడొ (1901 - 1968) సైరాకస్‌లో సిసిలియన్ తల్లిదండ్రులకు జన్మించాడు.

ఇంజనీర్ కావాలనే ఆశతో పాలెర్మొ, తరువాత రోమ్‌లోని పాలిటెక్నిక్‌లో చేరాడు. రోమన్ విశ్వవిద్యాలయంలో లాటిన్, గ్రీకు చదివాడు. ఆర్థిక కారణాలవల్ల చదువు పూర్తి చేయలేకపోయాడు. ఇటాలియన్ ఆర్మీ సివిల్ ఇంజనీరింగ్ విభాగంలో పనిచేస్తూ ఇటలీలోని అనేక ప్రాంతాలు తిరిగాడు. 1930లో మూడు కవితల్ని ప్రచురించాడు. అదే సంవత్సరం చివర్లో తన మొదటి సంకలనం ''వాటర్స్ అండ్ లాండ్స్'' ప్రచురించాడు. రెండు సంవత్సరాల తరువాత ''సంకెన్ ఒబొ'' ని ప్రచురించాడు. ఈ సంకలనం అతని గేయ పరిపక్వతని సూచిస్తుంది.

1930 - 38 ల మధ్య ప్రభుత్వోద్యోగాన్ని వొదులుకుని ప్రఖ్యాత ఇటాలియన్ రచయితలతో కళాకారులతో పరిచయాలను పెంచుకున్నాడు. 1938లో ''టెంపో'' అనే వారపత్రికకు ఎడిటరయ్యాడు. మూడు సంవత్సరాల తరువాత మిలాన్‌లోని ''గిస్సెప్పి వెర్డి'' కన్సర్వేటరీలో ఇటాలియన్ సాహిత్య విభాగానికి అధ్యక్షుడయ్యాడు.

1930లలో క్వాసిమొడొ ''హెర్మెటిక్ స్కూల్ ఆఫ్ పొయెట్రీ'' ఉద్యమానికి నాయకత్వం వహించాడు. 1940లో ప్రచురించబడ్డ ''గ్రీకు గేయాలు'' సంకలనం, 1942లో ప్రచురించబడ్డ 'న్యూపోయెమ్స్'' క్వాసిమొడొ మీద ప్రాచీన కవుల ప్రభావాన్నీ, జీవితాన్ని గూర్చి అతనికున్న విశాలమైన అవగాహనని తెలియజేస్తాయి. క్వాసిమొడొ చేసిన గ్రీకు, లాటిన్ కవులు సోఫొక్లిజ్, ఈస్కిలస్, యూరిపిడిస్, ఓవిడ్, వర్జిల్ మొదలైనవారి అనువాదాలు; షేక్స్పియర్, మోలియర్, 20వ శతాబ్దపు రచయితలైన నెరూడ, కమ్మింగ్స్, అడెన్‌లాంటి వారి అనువాదాలు అతని ఆధునిక దృక్పథాన్ని తెలియజేస్తాయి.

రెండో ప్రపంచ యుద్ధకాలంలో క్వాసిమొడొ - కవి ప్రజలతో, సమకాలీన సంఘర్షణలతో మమైక్యం చెందాల్సిన అవసరాన్ని గుర్తించాడు. ఫలితం, - 1946లో ప్రచురించబడ్డ ''డే ఆఫ్టర్ డే'', 1946 లో వచ్చిన ''జీవితం కలకాదు''

క్వాసిమొడొ తరువాతి సంకలనాలలో వ్యక్తిత్వం నించి సామాజిక ఐక్యతలోకి జరిగిన పరివర్తన, ప్రతిక్షణమూ మృత్యు భయం పరివేష్టించి ఉండే ఆధునిక ప్రపంచంలో జీవితాన్ని ధైర్యంగా జీవించడం గురించిన లక్షణాలు కనిపిస్తాయి. క్వాసిమొడొ జీవితాన్నీ, సాహిత్యాన్నీ ఉత్తేజపరిచేవిధంగా తన కవితా భాషను తీర్చిదిద్దుకున్నాడు. అతని కొన్ని కవితలు, విమర్శనాత్మక వ్యాసాలు 1960లో ఆంగ్లంలో ప్రచురించబడ్డాయి.

1953లో డైలాన్ థామస్‌తో కలిసి ''ఎట్నా టావొర్మినా'' అంతర్జాతీయ కవితా సాహిత్య పురస్కారాన్ని, మరెన్నో ఇతర పురస్కారాలను అందుకున్న క్వాసిమొడొ 1968 జూన్ 14న నేపుల్స్‌లో చనిపోయాడు.

# పురస్కారప్రధానం

సిసిలీలో జన్మించిన ఇటాలియన్ కవి సాల్వటార్ క్వాసిమొడాకు ఈ సంవత్సరపు నోబెల్ సాహిత్య బహుమతి ఇవ్వబడింది. అతను మొడికా అనే చిన్న కోస్టల్ టౌనులో జన్మించాడు. ఎంతో సౌందర్యవంతమైన ఆ ప్రాంతపు తీపి స్మృతులు, ప్రాచీన గ్రీసుదేశపు వారసత్వ సంపదకు ప్రసిద్ధిపొందిన దేవాలయాలు, ఇయోనియన్ సముద్రప్రాంతపు నాటకశాలలు, ప్రసిద్ధిపొందిన స్థలాలు ఊహా ప్రపంచాన్ని ఎంత ప్రభావితం చేస్తాయి! ఇక్కడే ప్రాచీన కాలంలో గ్రీకు కవిత్వంలో కీర్తించబడ్డ యోధానయోధులు హిరోన్ చక్రవర్తికి అతిథులుగా ఉన్నారు. ఇక్కడి నుండి పిండార్, ఈకిలస్ లాంటి మహానుభావుల కంఠాల ప్రతిధ్వనులు యుగయుగాల కాలపు తెరల్ని చీల్చుకుని వినిపించాయి.

క్వాసిమొడొ ఇక్కడే కవిత్వంలోంచి ఎదిగివొచ్చాడు. ఈ వాతావరణమే అతని యౌవనాన్ని ప్రభావితం చేసింది. ఈ ప్రాచీన సాహితీ సంప్రదాయ వారసత్వం నించే అతనికవితా ప్రస్థానం ప్రారంభమయింది, అతణ్ణి ఆధునిక ఇటాలియన్ కవిగా తీర్చిదిద్దింది. అయితే ఈ సాహిత్య సంప్రదాయవారసత్వం అతణ్ణి ఒక అనుకరణవాదిని చేయలేదు; అందుకు భిన్నంగా భాషా ప్రయోగంలో కళాత్మకతను సాధించేందుకు అతనికి కావలసిన అంతర్ క్రమశిక్షణని సాధించుకునేందుకు తోడ్పడింది. క్వాసిమొడొ ఈ సంప్రదాయ వారసత్వానికి ప్రతీకగా నిలిచాడు.

క్వాసిమొడొ 1930లో సాహిత్య క్షేత్రంలో అడుగుపెట్టాడు. అయితే 1940 - 50 ప్రాంతానికిగాని అతను ఆధునిక ఇటాలియన్ మహాకవిగా రూపుదిద్దుకోలేదు. అతను సిలోని, మొరాలియ, విట్టోరిని వంటి వామ పక్షీయుల తరానికి చెందినవాడు. వారిలాగే ఆధునిక ఇటలీ దేశపు రూపుదిద్దడంలో ప్రధానపాత్ర వహించాడు. అతని కవితా సంపద అంతవిస్తృతమైనదేమీకాదు. అతని సాహితీ సృజన అంతాకలిసి అయిదు సంకలనాలు మాత్రమే. ఈ అయిదు సంకలనాలు కవిగా అతని వ్యక్తిత్వాన్నీ, ప్రత్యేకతనీ వ్యక్తీకరించాయి. ఆసంకలనాల పేర్లే వాటి ప్రత్యేకతను చాటి చెబుతున్నాయి. అవి 1) ''అంతలోనేసాయంత్రం అయింది - ఇది 1942లో ప్రచురించబడింది. 2) రోజురోజూ (1946). 3) జీవితం కలకాదు (1949). 4) ఆకుపచ్చదనం కల్తీ ఆకుపచ్చదనం (1956). 5) పోల్చరాని భూమి (1958). ఈ సంకలనాలన్నిటినీ అంతర్లీనంగా కలిపే సూత్రం ఉంది. ఈ అయిదు సంకలనాల్లోనూ శుష్కవాక్యం వొక్కటీ కనబడదు.

క్వాసిమొడొ తన బాల్యంతోను, యౌవనంతోను పెనవేసుకున్న సిసిలీని గురించి అగాధమైన ప్రేమతో గానం చేశాడు. తను ఉత్తర ఇటలీకి వలసపోయినా, సిసిలీ దృశ్య సౌందర్యాలనూ, అక్కడి దేవాలయాలను, వాటి శిథిల సౌందర్యాన్నీ, పేదరికానికి ఆలవాలమైన అక్కడి పల్లెటూళ్ళనీ, దుమ్మదారుల్నీ, ఆలివ్ తోపుల్నీ, నురగలు కక్కే అలల నిట్టూర్పుల సంగీతాన్నీ, గొర్రెల కాపరుల పిల్లల్నీ తన కవిత్వంలో వర్ణించాడు. అయితే అతను ప్రాంతీయ కవికాడు. తన కవితా సమాగ్రిని ఒక ప్రాంతాన్నించి పోగు చేసుకున్నా అతని కవిత్వం విశ్వమానవ విషాదాన్ని గానం చేస్తుంది. అన్నిటికన్న ముఖ్యంగా ప్రపంచ యుద్ధం మిగిల్చిన కటికచేదు అనుభవాల నుండి ఉత్పన్నమైన పరిస్థితుల నుంచి,

పేరు లేని విషాదాలనించి, అనునిత్యమూ ఎదురయ్యే మృత్యువునించీ తన జాతి జీవిత నీతి సూత్రాలను అనుసంధించాడు; ప్రపంచ సాహిత్యంలో అత్యున్నత శ్రేణికి చెందిన కవితల్ని వ్రాశాడు తన దేశ ప్రజల అమరవీరత్వాన్ని ప్రత్యేకంగా కీర్తించిన ఏకైక కవి క్వాసిమొడొ.

కవిత్వం తనకోసం తాను బతకదు. కవిత్వం తన సృజనశక్తితో మనిషి తనని తాను సృజించుకునేందుకు తోడ్పడాలి. అదే ఈ ప్రపంచంలో కవిత్వపు బాధ్యత అని క్వాసిమొడొ నమ్మకం స్వేచ్ఛామార్గం మనిషి వొంటరి తనాన్ని జయించాలి ఆ విధంగా అతని కవిత్వం ఇటలీ ప్రజల ఆత్మచైతన్యానికీ, ఆత్మ ప్రబోధానికీ కళాత్మక రూపం. అతని కవిత్వంలో బైబిలు జాతీయాలతో పాటు ప్రాచీన పురాణాలకు చెందిన ఉదాహరణలు చోటుచేసుకున్నాయి. క్రైస్తవ కరుణవాదం ప్రధానంగా అతని కవిత్వానికి మూల లక్షణం.

పైన పేర్కొన్న కారణాలవల్ల స్వీడిస్ ఆకాడెమి నోబెల్ పురస్కారాన్ని మీకు ప్రధానం చేస్తున్నది. మీగేయ కవిత్వం ప్రాచీన చైతన్యజ్వాలతో ఆధునిక మానవుడి విషాదానుబావాలను వ్యక్తీకరిస్తున్నది.

మీ కవిత్వం ఇటలీలోని మీ దేశపు మిత్రుల, అభిమానుల శతాబ్దాల సందేశాన్ని మాకు తీసుకొస్తున్నది. అందుకు మిమ్మల్ని అభినందిస్తూ నోబెల్ సాహితీ పురస్కారాన్ని చక్రవర్తులవారి చేతులమీదుగా అందుకోవలసిందిగా మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను.

- ఎండర్స్ ఆస్టర్లింగ్, ( శాశ్వత కార్యదర్శి, స్వీడిష్ అకాడెమి)

## అంగీకారం

స్వీడన్ దేశాన్ని నేను ఎప్పుడూ నోబెల్ పురస్కారాన్ని అందుకున్నవారు దత్తత తీసుకున్న దేశంగా భావిస్తాను. ఇది సమకాలీన సంస్కృతిలో ఒక అత్యున్నతమైన అద్భుతమైన విషయం. ప్రపంచంలో ఏ ఇతర దేశమూ ఇలాంటి పురస్కారాన్నివ్వడంలో విజయవంతం కాలేదు. జనాభా విషయంలో అతి చిన్నదేశమైన మీదేశం అందిస్తున్న ఈ పురస్కారం విశ్వైక్యతను చాటుతున్నది.

అత్యంత అపురూపమైన ఈ పురస్కారం ప్రపంచ దేశాలన్నిటికీ, అన్ని రాజకీయ సంస్థలకు చెందిన వ్యక్తుల్ని, కవుల్ని, తాత్త్వికుల్ని ఈ పురస్కారాన్ని పొందేందుకు ఉత్తేజితుల్ని చేస్తున్నది. రాక్షసత్వానికి ఎంతబలమూ, ఆయుధాలూ, తలతిక్క సిద్ధాంతాలూ ఉన్నప్పటికీ సంస్కృతి ఎల్లప్పుడూ అనాగరికత్వాన్నీ, రాక్షసత్వాన్నీ వ్యతిరేకిస్తుంది. అతి ప్రాచీనమైన ఉత్తరాది సంస్కృతికి చెందిన ప్రతినిధులెందరో వున్నారు. ఈ సంస్కృతి తన చరిత్రలో మానవ స్వేచ్ఛ కోసం పోరాడింది; మానవత్వంతో నిండిన రాజుల్ని, రాణుల్ని తయారుచేసింది; కవులనూ, రచయితలనూ సృజించింది. అలాంటి ప్రాచీన కవులను గురించి మా ఇటలీలో ఇప్పటికీ చెప్పుకుంటూ వుంటారు. ప్రసిద్ధి పొందిన వైకింగ్స్ దగ్గర్నించీ ఈ శ్రావ్యమైన పేర్లు మాకు వినిపిస్తూనే వున్నాయి. ఇతర సంస్కృతులకు చెందిన కవులకన్న వీరే మమ్మల్ని ఎక్కువగా ప్రభావితం చేశారు. స్వీడన్ లాంటి దేశాలు ప్రపంచ సంస్కృతిని ప్రభావితం చేస్తున్నాయి. కవులూ, రచయితలూ ప్రపంచాన్ని మార్చే ప్రయత్నం చేస్తారు. కవిత్వం ఏకాంతంలో రూపుదిద్దుకుంటుందని మీకు తెలుసు. ఏకాంతంనించే అది ప్రపంచపు నలుమూలలకూ

వ్యాపిస్తుంది కవిత్వం ఎల్లప్పుడూ భాషిస్తుంది. వినేవాళ్ళు భౌతిక, అధిభౌతిక, బాహ్యాంత రాలకు చెందినవారెవ్వరైనా కావచ్చు.

ఇప్పుడు మనం మనిషికి సమానం కాని నూతన మానవత్వం గురించి మాట్లాడు తున్నాం కవి ఇప్పటి తాత్కాలిక బాహ్య నిర్మాణానికి కేంద్ర బిందువైతే అతడు ప్రమాదకారి ఎలా అవుతాడు? నేటి ప్రపంచం కవిత్వానికి వ్యతిరేకమైన వ్యక్తులతో చేతులు కలిపింది. అందుకే ఈ ప్రపంచానికి కవి ఉనికి ఒక అడ్డు గోడగా తయారయింది. మరోవైపు కవితా శక్తి నిర్మానుష్య మానవ సమాజాల మీదికి ప్రసరిస్తోంది. సాహిత్య క్రీడలు మనిషి అనుభూతులనించీ, అనుభవాలనించీ తప్పించుకుంటే కవితా వ్యాపకానికి అర్థంలేదు. కవిత్వం యొక్క విశ్వాంతరత కవిత్వపు శైలికి ముఖ్యమైనది. అలాంటి విశ్వాంతరత కీడు కలిగించే నీతివల్ల సాధ్యంకాదు. అది ప్రత్యేకమైన ఆత్మిక స్థితి వల్లనే సాధ్యం.

సౌందర్యాన్ని గురించి నా భావన కేవలం ఐక్యతే కాదు, విచ్ఛిన్నం కూడా, ఒక్కోసారి విచ్ఛిన్నత కూడా కవితా రూపాన్ని తీసుకుంటుంది. చిత్రలేఖనం, శిల్పం, సంగీతం వంటివాటి విషయంలో నీతి, విమర్శ, సౌందర్య దృష్టి మొదలైన సమస్యలు ఒకటే; ఇష్టాయిష్టాలూ ఒకటే. ఆధునికులు గ్రీకు సౌందర్యాన్ని ప్రమాదంలో ముంచారు. వాళ్ళు జీవితాన్ని అనుకరించే కొత్త రూపం కోసం పాత రూపాలను అరూప్యం చేశారు. కవి తన అస్తిత్వాన్ని సామాన్యుల భాషా శకలాల నుండి నిర్మించుకుంటాడు. జీవితపు ప్రతి అనుభవము అనుకోని విచ్ఛిన్నత నించీ, ఆధ్యాత్మిక అనిశ్చిత స్థితినించీ, ఒకే విధమైన ఆధ్యాత్మిక స్థితినించీ ఉద్భవిస్తుంది. కవి ఎల్లప్పుడూ ఖచ్చితంగాలేని డైరీని రాస్తుంటాడు. అతని కవితలు అంతకుముందులేని కొత్త భాషలో కళాత్మక రూపాన్ని తీసుకుంటాయి. ఈ శతాబ్దపు కవుల్లో చాలామంది గందరగోళంలో ఉన్నారు. మానవత్వాన్ని కోల్పోయారు. రాజకీయ సిద్ధాంతాల రాద్ధాంతాలయుగంలో ఇది సంభవం.

నేనిక్కడ సౌందర్య దృష్టిని గురించి మాట్లాడడంలేదు. ధీరులైన మానవులున్న దేశానికి, మా సంస్కృతి విలువైనదిగా భావిస్తున్న మీ దేశానికి నమస్కరిస్తున్నాను. మీ మధ్య నించున్నందుకు ఆనందిస్తున్నాను. మాన్యులైన మీ స్వీడన్ దేశపు రాజుగారికి, రాణిగారికి, స్వీడిష్ అకాడెమీకి నమస్కరిస్తున్నాను. మీ అకాడెమీకి చెందిన పద్దెనిమిది మంది జ్ఞానులూ నా కవిత్వానికి నోబెల్ పురస్కారాన్నివ్వాలని నిర్ణయించినందుకూ, నా ఇటలీ దేశాన్ని, సంస్కృతిని, సాహిత్యాన్ని గౌరవించినందుకు మరీ మరీ నమస్కరిస్తున్నాను.

దీనికి ముందు స్వీడిష్ అకాడెమీ సభ్యుడైన ఇ. జాన్సన్ - ''మీరు ఈ సంవత్సరపు నోబెల్ పురస్కారాన్ని అందుకోబుతున్నారు. శతాబ్దాలుగా సాంస్కృతిక తేజస్సుతో విరాజిల్లుతున్న దేశానికి మీరూ, మీ కవిత్వమూ ప్రాతినిధ్యం వహిస్తున్నారు మీరు ఒక కవితలో నేడు మనం నివసిస్తున్న సమాజపు భయంకర పాశవిక సత్యాలను వర్ణించారు. మీరు మాయుగానికి చెందినవారు. సాహిత్యంలో ఈయుగానికి చెందిన సమస్యల్ని, బాధల్ని, ఆశల్ని వర్ణించారు. మీకు మన సమాజం ఎదుర్కొంటున్న సమస్యల్ని గురించిన గొప్ప అవగాహన ఉంది. మీ హృదయం తాడితుల, పీడితుల యెడ కరుణతో నిండి ఉంది. ఇవే మీకవిత్వపు ప్రాథమిక లక్షణాలు'' - అని క్వాసిమొడొను అభినందించారు.

# ఆనంద భిక్షువు

## (మే 18వ తేది చలం జయంతి సందర్భంగా)

– డా॥ యు.ఎ. నరసింహమూర్తి

''అయినా ఆతృప్త మానవ జీవిత బుభుక్ష
అడుగున నిరంత రానంద భిక్ష'' - అంటాడు బైరాగి

ఆంధ్రదేశాన్ని బహిష్కరించి అరుణాచల శిఖరమెక్కి వెలుగులు కుమ్మరించిన ఆనంద భిక్షువు గుడిపాటి వెంకట చలం. బరితెగించిన నాటి నుండి భగవాన్ పాదాల ముందు మోకరిల్లిన దాకా ఆయన ఆనందతత్త్వాన్ని అన్వేషిస్తూనే ఉన్నాడు.

చలం అన్నమాట అనుచిత విభాగం వల్ల ఏర్పడింది. అందుకే ననుకుంటాను - సమాజంలో ఏర్పడ్డ అనుచిత విభాగాన్ని ఆయన ఎదిరించాడు. యుద్ధరంగంలో అసహాయశూరుడు, ఏకాంగవీరుడు వంటి మాటలు ఉపయోగిస్తారు. అవి ఎవరికి చెందుతాయో నాకు తెలియదు. కాని 20వ శతాబ్దపు తెలుగు సమాజాన్ని ఎదిరించిన చలం ఏకాంగవీరుడు, అసహాయశూరుడు అని చెప్పగలను. అందుకే ఆయన బహిష్కృతుడు, పరిచ్యుతుడు అయ్యాడు. సంఘంతో సుదీర్ఘ సంఘర్షణకు సంసిద్ధుడైన స్థిర మనస్కుడు చలం. అందుకే ఆంధ్రదేశాన్ని వదలి అరుణాచలాన్ని అధిరోహించేడు.

తెలుగు నిఘంటవుల్లో చలం అన్న పదానికి స్వేచ్ఛ అనే అర్థాన్ని కూర్చాలి. సాంప్రదాయికులు దానికి విశృంఖలత్వం అని అర్థం చెప్పాలనుకున్నారు. అది అవగాహనలోపం. చలం చాలమందికి అవగాహన కాలేదు.

స్వేచ్ఛ అనే దానికి రెండు పార్శ్వాలుంటాయి. ఒకటి ఆనందం, మరొకటి వేదన. ఆ రెండు పార్శ్వాలు తానై నిలిచిన తాత్త్వికుడు, స్వాప్నికుడు చలం. ఆది ఋషుల నుండి అధునాతనుల వరకు ప్రపంచ ప్రసిద్ధ తాత్త్వికుల నందరను మథించి వదలిన చదువరి చలం. ఆ చలమే తన కసలు చదువే రాకపోతే ఇంకా బాగా రాసేవాణ్ణన్నాడు. తన కలల్ని కల్తీ చెయ్యకుండా అందించగలిగి ఉండేవాడినన్నాడు.

వేమన యోగి అయిన కథ విన్నాం. చలం యోగి అయిన కథ కన్నాం. చలం మామూలు యోగి కాడు. మణికట్టుకు మల్లెపూలు కట్టుకున్న యోగి. శృంగారానందంలోని లోతుల్ని తరచి ఉండకపోతే ఆధ్యాత్మికానందపు అంచుల్ని తాకలేక పోయేవాణ్ణే అన్నాడాయన. ఆయనొక నిరంతర సంభాషణశీలి. ఎదిగిన కొద్దీ క్రమంగా మౌని అయ్యాడు. అందుకే ఏదో ప్రతి ఆర్టిస్టూ మౌని అవుతాడన్నాడు అయన. 'యోగి సర్వదా అనుభవించే అనిర్వచనీయానందాన్ని ఆర్టిస్టు fitful గా అనుభవిస్తాడని అనుభవ పూర్వకంగా చెప్పేడాయన. ''సేవ ఆనందం కాదా వెట్టిదానా!'' అని కృష్ణుడు పలికే యశోదాగీతాల నుండి వెనక్కి వెళ్తే అమీర్ సేవకి అంకితమైన రాజేశ్వరి దాకా ఆనంద స్వరూపం ఒకలాగే కనిపిస్తుంది చలం లాంటి తాత్త్వికుడికి.

''నీ ఆనందమూ నీ విరహమూ రెంటినీ భరించలేకుండా చేస్తుంది నీ సుందరతేజస్సు'' అని కృష్ణుణ్ణే ప్రార్థించే యశోదలో 'బాధలో కూడా ఆనందం కనబడుతుంది నాకు' ఈ యోగులకు ఆనందంలో బాధ కనబడుతూంది.'' అని తొలిరోజుల్లో మ్యూజింగ్సు రాసిన చలం కనిపిస్తాడు.

''లోక సౌందర్యాన్ని నాయింట్లోకే తీసుకువచ్చావు ఎక్కడికీ వెళ్లాలనిపించదు'' అంటోంది యశోద కృష్ణుడితో. మనిషిలో ఎట్లావుందో, ఎందుకువుందో, అతని లోపలేగొప్ప ఆనందం వుంది. అతను ఆనందాన్ని అనుభవించే నిమిషంలో తనలోపలి ఆనందాన్ని పై వస్తువుల సహాయంతో అనుభవిస్తున్నాడు. ఆనందాన్ని అందుకోగలిగితే అతని జీవితం ప్రతి నిముషం ఆనందమయ మౌతుంది - అన్న చలం మాటలు యశోద స్థితిని వివరిస్తాయి.

సుఖము - బాధ యీ రెండే విలువలు అని గ్రహించిన చలం సమాజపు కట్టుబాట్లకి లోబడి అందరితో కలిసి బాధ అనుభవిచే కంటె, సమాజానికి ఎదురీదే శక్తిగా మారి అందరికీ సుఖాన్ని పంచాలని చూసేడు. ఇతరుల్ని ఆలోచించేటట్టు చేసి, వారి బతుకుల్లో కాంతిని కుమ్మరిస్తానని ఆధారంలేని నమ్మకంతో జీవితంలో ఒక పార్శ్వంతో పెనుగు లాడేడు. తన ఇష్టాన్ని జీవిత ప్రవాహంమీద గుద్ది నిలబడ్డాడు. ఆనందం మనిషిహక్కు అని విశ్వసించి తనమాటల్తో కాక, మాటల్లోని వాస్తవికతతో పాఠకుల్ని కదిలించినవాడు చలం. అతని జీవితానికి, అతని రాతలకీ ఎంతో కలయిక కనబడుతుంది. జీవితమంతా విరామం లేని క్షోభ అనుభవించాడు చలం. చివరకు అయనకు బాధకు, సుఖానికీ ఏమీ భేదం లేదన్న కబీరు నిశ్చిత కంఠం వినిపించింది.

విద్య - వివాహం అనే రెండు సమకాలీన వ్యవస్థల మీద ధ్వజమెత్తాడు చలం. ఆరెంటినీ తన కావ్యాల వల్ల, బోధనల వల్ల సమూలంగా మార్చాలని తన జీవిత పూర్వభాగమంతా ఎంతో ప్రయత్నించాడు. అక్కడ ప్రారంభమైన చలం ఆనంద విజయం తన దర్శన సాంగత్యాల కోసం వచ్చిన వారికి ''ఏ ప్రయత్నమూ ఆశా లేకుండా నిలిచిపో'' అన్న భగవాన్ వాక్యాల సారాన్ని అందించడంలో ముగిసింది. అప్పుడాయన ఎవరికీ లోబడనూలేదు; ఎదురుతిరగనూ లేదు, భగవాన్ దగ్గరకు చేరాక, ఈశ్వరవ్యాఖ్యానంతో ప్రతిదానిని అంగీకరించేస్థితికి చేరుకున్నాడు. దానిని ధీరలక్షణంగా పరిగణించాడు.

సంఘానికి కులానికి మతానికి వెలిబడ్డ ఏకాకి చలం. ఇష్టం వచ్చినట్టుండే వాడే కాని, పూర్వంనించీ ఏర్పడ్డ పద్ధతుల ప్రకారం నడచేవాడుకాడు. లోపల అనుభవిస్తున్న తక్కువ తనం కోసం తన ఆధిపత్యాన్ని వదులుకోలేని సంఘర్షశీలి చలం. కొన్నాళ్లు బ్రహ్మసమాజంలో చేరాడు. ఎప్పటికీ సంఘం కాళ్లు పట్టుకోనివాడు. గుంపులో చేరాలని ఎన్నడూ అనుకోనివాడు. కీర్తికాంత చిరునవ్వుల్ని తృణీకరించినవాడు. సత్యాసత్యాల అసలు తత్త్వాన్ని శోధించేవాడు. ప్రపంచం మాయ కావచ్చు - అనుభవం మాయకాదు అనే విశ్వాసంతో చిరకాలంపాటు శంకరాద్వైతానికి ఎదురుతిరిగినవాడు.

సౌందర్యం-సుహృద్భావం-ప్రేమ-ఆనందం-కళ అనేవి చలానికి పంచప్రాణాలు. పంచప్రాణాలను-

వేరుపరచి చూపడం ఎలా సాధ్యం కాదో అలాగే చలంలో ఈ భావాలను వేరుపరచి చూపడం సాధ్యం కాదు. ఆయన ఉత్సాహము, ఉద్ధృతి, ప్రయత్నమూ, త్యాగము అన్నీ వీటిని వదలుకోకుండా ఉండడం కోసమే ప్రయత్నించేయి. సౌందర్య తృష్ణ మలినమైతే నేనూ మలినుణ్ణే అన్న ధీరుడు చలం ''ఋషులూ ప్రవక్తలూ ఎంత నిశ్చయంతో ఆధ్యాత్మికానుభవాల్నీ స్వర్గానందాన్ని మాట్లాడారో, అంతకన్న బలంగా రాస్తాను శృంగారాన్ని నేను'' - అని చలం అనగలిగే బలం ఆప్రయత్నంలోంచి సిద్ధించింది. శృంగార జీవితంలోని క్షుద్రమైన, చంచలమైన ఆశల్ని తప్పించి శుభ్రతను, వెలుగును నింపేదిశలో ఆయన కాల్పనికత కొనసాగింది. ఆ కల్పనలలో ఉండే ఆనందమే చలాన్ని ప్రోత్సహించి, ధైర్యమిచ్చి, ఓదార్చింది.

సృష్టించడం కంటె ఆనందకరమైన విషయం ప్రపంచంలో లేదంటాడు చలం. నిర్జీవ కళలే అద్వితీయానందాన్నిస్తున్నప్పుడు ఈశ్వరుని సజీవసృష్టి ఎంత ఆనందమయమైనది? అనే విషయం వైపు మరిలింది చలం దృష్టి. ఆర్టిస్టు చేసే అందాన్ని అనుభవించే ఆనందాన్ని ఇతరులెరుగరు. కళ నుండి శుద్ధమైన ఆనందాన్ని అనుభవించునన్న వాల్టర్‌పేటర్ అభిప్రాయంతో చలం విభేదించేడు. అలవికాని సౌందర్యం ఆనందాన్నిచ్చి, ఆ పట్టరాని తనంలోంచి భరించరాని బాధమొలకెత్తీ, నిర్విరామంగా బాధకలిగి, ఆ తర్వాత దశలో అది గొప్ప ఆనందంగా మారడంగాని, లేదా ఆనందమూ, వేదన అనే ద్వంద్వాలకు అతీతమైన దశకు చేరడంగాని జరుగుతుందని చలం భావించేడు.

ఈ ఆనందం స్వభావమేమిటి? యీ జ్ఞానం స్వభావమేమిటి? అని ఎన్నోసార్లు తనను తాను ప్రశ్నించుకున్నాడు చలం. నలుగురిలో, ప్రేమలో, స్నేహంలో, ప్రపంచ సంస్కార ప్రయత్నంలో తనను మైమరిచ పోవడమే ఆనందం అన్న బెర్ట్రాండ్ రస్సెల్‌తో చలం ఏకీభవించలేదు. గేదెలు, కుక్కలులా మైమరచి పోయే ఆనందం కంటె ఆనందిస్తున్నాననే స్పృహకలిగి ఆనందించడం అతీతానందం అంటాడు చలం. దానిని ఆయన ''అహం యీ స్వరంలో కలవకూడదు. ఈ సర్వమూవచ్చి నా అహంలో కలవాలి'' అని వివరించేడు.

ట్రైనింగు స్కూల్లో పరీక్షలకు వాచరుగా ఉంటూ దూరంగా పచ్చికలో విరిసిన ఒక గడ్డిపువ్వు అందాన్ని చూసి ఎంతోసేపు ఆయన ఆనందించేడు. ఆ తర్వాత అది పువ్వు కాదని ఒక ఎర్రని కాగితపు ఉండ అని తెలిసింది. యథార్థ జ్ఞానం లేనంతసేపూ ఆనందించగలిగేడు. భ్రమతొలగిన తర్వాత ఆ ఆనందపు స్థితి ఏమిటి? అనేప్రశ్న - అప్పుడు మొలకెత్తింది. ఆనందాన్ని నశింపజేసే జ్ఞానం వలన ఏమిటి లాభం? అతనిని వేదాంత లోకానికి తరలించింది.

ఆనందం పొందగల సంస్కారం ఎవరు పంచగలరు? విద్యా? సాధనా? వాతావరణమా? వయఃపరిణతా? ఇవేవీకాదు అని తెలుసుకున్నాడు చలం. ఒక కవి 'ముళ్లలో గులాబిపువ్వు ఉందే!' అని ఆశ్చర్యపోతే, ఇంకొకడు 'గులాబి పువ్వు చుట్టూ ముళ్ళున్నాయే!' అని ఏడుస్తాడట. అది సంస్కార

విశేషమున్నాడు. ఒకడు ఉన్న ఆనందాన్ని చంపుకుంటాడు ఇంకొకడు లేని ఆనందాన్ని సృష్టించుకుంటాడు. ఆధారం లేకుండా, దాని నుండి కలిగే ఆనందాన్ని సృష్టించుకోగలగడం అదృష్టం అంటాడు చలం. అది అతీంద్రియ దృష్టి వలన సిద్ధించే యోగానందానికి, పరమానందానికి, బ్రహ్మానందానికి, రసానందానికి మార్గదర్శకమవుతుంది

ఆనంద ఉపాధిలో ఇచ్చిపుచ్చుకునే లక్షణం ఉండాలా? అక్కరలేదా? సముద్రాన్ని చూసి మనం ఆనందిస్తాము. 'నీరాక నాకెంత ఆనందం కలిగిస్తూంది?'' అని సముద్రం అనుకుంటుందా? అన్నది చలం ప్రశ్న. అందుకే కవులు ప్రకృతిని మానవీకరిస్తూ ఉంటారు ఆ మానవీకరణంలోంచి రస్యాందం జనిస్తుంది. ఒక సందర్భంలో ఆనందపు స్వల్పత్వము, వ్యర్థత్వము గోచరిస్తాయి. ఎందుచేతనంటే ఒక వస్తువుకి శాశ్వతంగా ఆనందాన్నిచ్చే లక్షణం ఉండకపోవచ్చును. ఒకవ్యక్తికి శాశ్వతంగా ఆనందించే లక్షణం లేకపోవచ్చును. దీనినే ''ఏ వస్తువులోనూ చిరమైన తృప్తినిచ్చే గుణమూలేదు. ఏ ప్రాణిలోనూ తృప్తిపడే స్థిమితమూ లేదు.'' అందుకే స్థిరమైన తృప్తికరమైన పరిపూర్ణమైన ఆనందంకోసం అన్వేషణ కొనసాగుతూనే ఉంటుంది.

చలం ఆనందదర్శనంలో నాలుగు వికాసదశలు కనిపిస్తాయి. శబ్ద స్పర్శ రూప రస గంధాత్మకమైన భౌతిక ప్రపంచ సంబంధమైన సౌందర్యానుభవంలోంచి ఉద్భవించిన ఆనందం. ఇది ఇంద్రియ సంబంధమైనది. ఇంద్రియవ్యాపారాల్ని వ్యత్యస్తం చేస్తూ, భౌతికంగా లేని వస్తువును ఉన్నట్లుగా ఊహిస్తూ, భ్రమను సత్యంగా తలచే, తలపించే ఆనందం రెండవది. ఇది అతీంద్రియానందం. తాను ప్రకృతిలో లీనం కావడాన్ని అరికట్టి, ప్రకృతినే తనలో చూసుకుంటూ, అహంకారంలో సర్వాన్ని లీనంచేసే మానసికానందం మూడవది. ఇది యౌగికానందం. ప్రతి దానిని అంగీకరించేస్థితికి చేరుకుని, మేలుకున్నప్పుడు కూడా నిద్రలో వొదిలేసినట్టే ''నేను'' అనే స్థితిని మాయం చేసే ఆనందం నాల్గవది. ఇది ఆధ్యాత్మికానందం.

చలం మొదటి దశలో ''నువ్వుకళలో లీనం కావాలి. కళ నీలో లీనం కాదు'' అన్నాడు. రెండవదశలో '' ఆనందమైన భ్రమని చంపే జ్ఞానం యేం లాభం'' అన్నాడు. మూడవదశలో ''అహం ఈ సర్వంలో కలియకూడదు. ఈ సర్వమూ వచ్చి నా అహంలో కలవాలి'' అన్నాడు. నాల్గవదశలో '' ఈ సంసారారణ్యతల్ని తెంపుకుని ముందుకు సాగారా, మీ ముందున్నది ఆనందవార్థి'' అన్నాడు. చలం జీవితంలోను, రచనల్లోను ఈ క్రమపరిణామ దశలు కనిపిస్తాయి. ప్రపంచం - ఆత్మ - ఈశ్వరుడు అనే మూడు పథాలలో సాగిన చలం ఆనందగంగ రసాతలం నుండి భూతలానికి, భూతలం నుండి స్వర్గసీమకు తన ప్రస్థానాన్ని కొనసాగించింది. అందుకే ఆయనకు ఈశ్వరాశీర్వాదాలు లభించాయి. ఈశ్వరదర్శనం అయింది.

# విజ్ఞాన శాస్త్రాలకు అంతుపట్టని ఇంద్రియానుభూతి

- డా॥ చాగంటి కృష్ణకుమారి

పొద్దుతిరుగుడు పువ్వు ఎలా ఉంటుంది?
పసుపు పచ్చగా ఉంటుంది.
మంకెన పువ్వు ఎలా ఉంటుంది?
ఎర్రగా ఉంటుంది.
ఇవీ ఓ ప్రశ్నలేనా? ఆహా ప్రశ్నలే! చాలా క్లిష్టమైన ప్రశ్నలు.

మీ పసితనంలో మీ అమ్మ పసుపురాసుకొన్న తన పాదాలని చూపిస్తూ 'ఇది పసుపు' నేను పెట్టుకొన్న కుంకుమరంగు 'ఎరుపు' - అంటూ మీకు రంగులను చూపించింది. వాటిని గుర్తు పట్టడం నేర్పించింది. అందువల్ల అన్నీ తెలుసును అన్న అహంభావంతో, ఇవీ ఓ ప్రశ్నలేనా? అని అడుగుతున్నారు. పొద్దు తిరుగుడు పువ్వు పసుపు పచ్చగా ఉంటుంది అన్నారు కదా! ''పసుపు పచ్చగా ఉండటం అంటే ఏమిటి? పోనీ 'ఎరుపు' అంటే ఏమిటో చెప్పండి చూద్దాం.'' 'తేనె తీయగా ఉంటుంది; చింతకాయలు పుల్లగా ఉంటాయి. అందులో ఏమీ సందేహం లేదు. కానీ తియ్యగా ఉండటం అంటే ఏమిటి? పోనీ 'పులుపు' అంటే ఏమిటో చెప్పండిచూద్దాం? ప్రక్క ఇంటి అమ్మాయి వీణ వాయిస్తోందనీ, రోడ్డుమీద ట్రాఫిక్ జామ్ అయి మహా రొదగా ఉందనీ మీరు చెప్పగలరు. వీధి గదిలో కూర్చున్న మీరు, పెరట్లో పారి జాతాలు విచ్చుకొంటున్నాయనీ, వంట ఇంటిలో కూర మాడిందనీ చెపుతారు.

కన్ను, ముక్కు, నాలిక, చెవి, చర్మం - ఇవే, ఈ ఇంద్రియాలే మనిషికి పరిసరాల గురించిన సాధారణ విషయ పరిజ్ఞానాన్ని ఇస్తున్నాయి. ఒక ప్రణాళిక ప్రకారం చేసిన ప్రయోగాల వల్ల రూపొందే శాస్త్రపరిజ్ఞానం కూడా మానవ ఇంద్రియాలు అప్పటి కప్పుడు ప్రసాదించే ఇంద్రియజ్ఞానం మీద ఆధారపడే ఉంటుంది. అయినప్పటికీ, బాహ్య ప్రపంచంతో ఇంద్రియాలకి ఉన్న సంబంధాల గురించి విడమరచి చెప్పగలిగే శక్తి శాస్త్రపరిజ్ఞానికి లేదు. ఇంద్రియ జ్ఞానాన్ని ఉపయోగించుకొంటూ రూపొందిన శాస్త్ర పరిజ్ఞానంలో ఇంద్రియానుభూతి గుణాలు మచ్చుకైనా కనిపించవు. ఇది చాలా విచిత్రమైన పరిస్థితి. ఈ విషయాన్ని సామాన్యులు ఒప్పుకోరు. శాస్త్రజ్ఞుల పట్ల వారికి ఉండే అపారమైన గౌరవ భావమే అందుకు కారణం కావొచ్చు. ఎంతో చాతుర్యంతో అద్భుతమైన శాస్త్రీయ పద్ధతులను రూపొందిస్తూ, వాటిని మెరుగుపరుస్తూ, అత్యంత ఆధునికమైన పరిజ్ఞానాన్ని శాస్త్రజ్ఞులు అందిస్తూ ఉంటారనీ, వారు ఏ విషయాన్ని అయినా పూర్తిగా విడమరచి చెప్పగలరనీ సామాన్యులు నమ్ముతారు.

పసుపు పచ్చగా ఉండటం అంటే ఏమిటి? అనే ప్రశ్నకు సామాన్యులు సమాధానం చెప్పలేక పోవచ్చు. కాబట్టి ఒక భౌతిక శాస్త్రజ్ఞున్ని అడిగి చూద్దాం.

590 మిల్లీ మైక్రానుల దాదాపుల్లో తరంగ దైర్ఘ్యం (wave length) గల విద్యుదయస్కాంత తరంగాలు అని అతను చెపుతాడు.

'పసుపు రంగు ఎక్కడనించి వచ్చింది?' - అని మళ్లీ మనం ప్రశ్నించవచ్చు

'నేను రూపొందించిన నిదర్శనాధార చిత్రంలో రంగు ఉండదు. ఈ రకమైన కాంతి కంపనాలు ఆరోగ్యంగా ఉన్న కంటి రెటీనాని తాకితే, ఆ కన్ను గల వ్యక్తికి పసుపు రంగు అనుభూతి కలుగుతుంది' అంటాడు.

అతనిని వదలకుండా మరిన్ని ప్రశ్నలతో చుట్టు ముట్టితే రంగుల గురించి ఇంకా ఇలా చెప్పుకుపోతాడు

కాంతి తరంగదైర్ఘ్యం (అల పొడవు) బట్టి రంగు అనుభూతి ఉంటుంది. విద్యుదయస్కాంత తరంగాలన్నీ మీకు రంగు అనుభూతులను ఇవ్వవు. 800 నుంచి 400 మిల్లీ మైక్రానుల తరంగ దైర్ఘ్యం గల తరంగాలు మాత్రమే రంగు అనుభూతులను ఇస్తాయి. 800 మిల్లీ మైక్రానుల కంటే ఎక్కువ తరంగ దైర్ఘ్యం గల పరారుణ తరంగాలు, 400 మిల్లీమైక్రానుల కంటే తక్కువ తరంగదైర్ఘ్యం గల అతినీలలోహిత తరంగాలు కంటికి కనిపించవు అంటాడు ఇక్కడ తమాషా ఏమిటంటే అతని శాస్త్రీయ దృష్టికి పరారుణ కాంతి, అతినీలలోహిత కాంతి కంటికి కనిపించే కాంతి వంటివే. ఇవన్నీ విద్యుదయస్కాంత తరంగాలే అంటాడు అన్నీ ఒకే కుటుంబానికి చెందుతాయి అంటాడు. అంటువంటప్పుడు మనిషి కన్ను ప్రత్యేకించి చాల చిత్రంగా ఆ అవధి లోని తరంగాలనే చూడటానికి ఎందుకు ఎంచుకొంది, మిగిలిన వాటిని ఎందుకు చూడలేకపోతుంది?

శాస్త్రజ్ఞున్ని మనం ఇంకా ఇలా ప్రశ్నించవచ్చు '590 మిల్లీ మైక్రానుల తరంగాలే, అవి మాత్రమే పసుపురంగు అనుభూతిని ఇస్తాయా?''

''కాదు, అవి మాత్రమే ఇవ్వవు. ఎరుపు అనుభూతిని ఇచ్చే తరంగాలు (760 మిల్లీ మైక్రాన్లు), ఆకుపచ్చ అనుభూతిని ఇచ్చే తరంగాలు (535 మిల్లీ మైక్రాన్లు) ఒక నిర్దిష్టమైన నిష్పత్తిలో కలిసిపోతే, పసుపురంగు అనుభూతి కలుగుతుంది. ఈ పసుపుకీ, 590 మిల్లీ మైక్రానుల తరంగాల వల్ల కలిగే పసుపు రంగుకీ తేడా ఉండదు. రెండూ ప్రక్క ప్రక్కన ఉంటే ఏది ఏదో పోల్చుకోలేము''. '' ఈ విధంగా తరంగాలను కలపటం ద్వారా రంగులను పొందడానికి ఏదైనా కచ్చితమైన శాస్త్రీయ పద్ధతిని రూపొందించగలమా?''

''లేము. అందుకు అవకాశం లేదు. ఇటువంటి రంగు మిశ్రమాల చార్టును ఒక దానిని తయారుచేశారు. దానిని వర్ణ త్రికోణం అంటారు. ఈ త్రికోణానికి తరంగదైర్ఘ్యంతో సంబంధం లేదు. రెండు తరంగాలను కలిపితే వచ్చే మిశ్రమం రంగు ఆ రెండింటి మధ్య విలువే కావాలని రూలు లేదు. ఉదాహరణకి కాంతి వర్ణపటానికి ఆ చివర్న ఉన్న ఎరుపునీ, అ చివర్న ఉన్న నీలాన్నీ కలిపితే పర్పుల్ వస్తుంది. ఈ రంగు ఇలాగే వస్తుంది కానీ, మరో విధంగా రాదు. ఈ రంగు ఏక వర్ణకాంతి కిరణం వల్ల రాదు. మరో ముఖ్యమైన విషయం, వర్ణ త్రికోణం అందరికీ ఒక్కలాగే కనిపించదు. వ్యక్తికీ, వ్యక్తికీ మారుతూ ఉంటుంది. త్రివర్ణ గ్రాహకులకు ఇది మరోలా కనిపిస్తుంది వారి అనుభూతి వేరుగా ఉంటుంది.'

ఈ విధంగా భౌతిక శాస్త్రజ్ఞుడు తన నిదర్శనాత్మక చిత్రాన్ని ఆధారంగా చేసుకొని రంగు అనుభూతిని వివరించలేక పోయాడు. శరీరధర్మ శాస్త్రజ్ఞుడు వివరించగలడు అంటారా? అతను కూడా వివరించడలుగుతాడని నేను అనుకోను. రెటీనా, కార్నియా, ఐరిస్ వంటి సాంకేతిక పదాలను వాడుతూ అతను కన్నును వర్ణిస్తాడు. నేత్ర పటలంలోని కణస్థాయీ సూక్ష్మ నిర్మాణాన్ని ఎలక్ట్రాన్

సూక్ష్మదర్శినితో కనుగొన్నాము అంటాడు. రెటీనాలో జరిగే ప్రక్రియలూ, అవి నేత్రనాడులలో కలగజేసే ప్రచోదనాలూ, అవి మెదడును చేరే విధానం చెప్పుకొస్తాడు. నేత్ర నాడీ తంత్రులు ఏ మేరకు ఉత్తేజితమయ్యాయో, దానివల్ల మెదడులోని ఏ ఏ కణాలలో ఎటువంటి ప్రత్యేకమైన ప్రక్రియలు జరుగుతాయో చెపుతాడు వాటి గురించి చాలా కచ్చితమైన పరిజ్ఞానాన్ని ఇస్తాడు. చిట్టచివరికి, ''ఈ ప్రక్రియలన్నీ జరిగినప్పుడు ఆ కన్నుగల వ్యక్తి మెదడులో పసుపు అనుభూతి నమోదు అవుతుంది'' అంటాడు.

సరదాకి రంగును ధ్వనితో పోల్చి చూద్దాం. ధ్వని తరంగ పౌనఃపున్యాన్ని బట్టి స్వరస్థాయి ఉంటుంది. మనిషి వినగలిగే ధ్వని పౌనఃపున్యాల విస్తృతి చూడగలిగే కాంతి పౌనఃపున్యాల విస్తృతి కంటే చాలా ఎక్కువగా ఉంటుంది. రకరకాల ధ్వని పౌనఃపున్యాలు కలసి పోవడం వల్ల ఏక పౌనఃపున్యం విలువ కల మరో స్వర స్థాయి పుట్టదు. ఈ విషయంలో కాంతికీ, ధ్వనికీ తేడా ఉంది ఒక దాని మీద ఒకటి అతిదేశించుతూ వస్తున్న ధ్వని తరంగాలలో ఎన్ని స్వరస్థాయీ బేధాలు ఉన్నా, అవి అన్నీ విడివిడిగానే వినిపిస్తాయి. ఇటువంటి స్థాయీ బేధాలను సంగీత జ్ఞానం ఉన్న వ్యక్తులు సులభంగా గుర్తించగలుగుతారు. కంఠస్వరాలకీ, వాయిద్యాలకీ ఒక విశిష్టమైన ధ్వని కంపన స్వరూపం ఉంటుంది దీనిని నాదగుణం అంటారు, వినిపిస్తున్న నాదం వీణదా, వాయులీనానిదా, బడిగంటదా లేక గుడిగంటలదా, అన్న విషయం నాదగుణాన్ని బట్టి తెలిసిపోతుంది. మామూలు శబ్దాలకి కూడా నాదగుణం ఉంటుంది. ఆకలితో ఏడుస్తున్న పసిపిల్ల వాళ్ల అమ్మపాల డబ్బామూతని చెంచాతో తీసే చప్పుడునీ, గ్లాసులో పాలపొడినీ, నీటినీ చెంచాతో కలుపుతున్న చప్పుళ్లనీ విని తన కోసం పాలు తయారవుతున్నాయని గ్రహిస్తుంది. తక్కున ఏడుపు మానేస్తుంది ఆ చప్పుళ్లకి ఉన్న ప్రత్యేకమైన నాదగుణాన్ని ఆ పసి పిల్ల పసిగట్టేస్తుంది. వీటన్నింటిలో ధ్వని తరంగ పౌనఃపున్యాలు కలిసిపోతున్న నిష్పత్తిని బట్టి నాదగుణం ఉంటుంది. ధ్వని పౌనఃపున్యాలు అవిచ్ఛిన్నంగా మారిపోతూ ఉంటే మనకి చికాకు పుడుతంది. పారిశ్రామిక నగరంలో ఓ అయిదారు ఫ్యాక్టరీల సైరన్లు ఒకేసారి గొంతెత్తితే ఎలా ఉంటుంది? కాంతికీ, ధ్వనికీ-ఈ విషయంలో కూడా తేడా ఉంది. కాంతి పౌనఃపున్యాలు అవిచ్ఛినంగా మారిపోతూ ఉంటే ఏర్పడేవన్నెల వల్ల అందం అతిశయిస్తుంది. ఆ విధంగా అతిశయించిన అందాన్ని వర్ణచిత్రాలలోనూ, ప్రకృతిలోనూ మనం చూస్తాం.

శరీర ధర్మశాస్త్రజ్ఞుణ్ణి వినికిడి గురించి వివరించి చెప్పమంటే ''శ్రవణ నాడులు ధ్వని సమాచారాన్ని మెదడులో ఒక ప్రత్యేకమైన భాగానికి చేరవేస్తాయనీ, అప్పుడు ఆ చెవిగల వ్యక్తి మెదడులో ధ్వని అనుభూతి నమోదు అవుతుంది.'' అని చెపుతాడు.

ఈ విధంగా భౌతిక శాస్త్రజ్ఞుడూ, శరీర ధర్మశాస్త్రజ్ఞుడూ, ధ్వని విషయంలో రూపొందించిన నిర్మాణాత్మక చిత్రాలలో అనుభూతికి సంబంధించిన గుణాలు ఉండవు. శరీర ధర్మశాస్త్రజ్ఞుల దగ్గర్నుంచి ఇటువంటి సమాధానాలు మనకి రంగు, ధ్వని విషయాలలోనే ఇలా ఉండవు. 'రుచి'కీ అంతే 'వాసన'కీ అంతే. మరేదైనా కూడా అంతే! ఇంద్రియానుభూతుల గురించి శాస్త్రజ్ఞులు ఎంత శాస్త్రీయంగా, నిదర్శనాలతో వర్ణించి చెప్పినా, చివరకు వారి సమాధానం 'మీ మెదడులో ఆ అనుభూతి నమోదు అవుతుంది' అనే వాక్యంతోనే ముగుస్తాయి.

తేనెటీగలు అతినీలలోహిత కాంతిని చూడగలవు కాంతి ఏ కొద్దిపాటిగా ధృవణం చెందినా అవి గుర్తు పట్టగలవు మనిషి అతినీలలోహిత కాంతిని చూడలేడు సంపూర్ణంగా ధృవణం చెందిన కాంతిని కూడా అతను గుర్తించలేడు మామూలు కాంతికీ ధృవిత కాంతికీ అతనికి తేడా తెలియదు గబ్బిలాలు అత్యధిక ధ్వని పౌనఃపున్యాలు గల Ultra Soundని వినగలవు మనిషికి అది సాధ్యం కాదు మనుషులకంటే ఎక్కువ సమర్ధవంతంగా జంతువులు వాసనలను పసిగట్టగలవు. భౌతిక రసాయనిక ప్రేరణలలో గల ఏ ఏ లక్షణాల వల్ల మనుషులకంటే జంతువులకు ఇంద్రియజ్ఞానం ఎక్కువ సున్నితంగా ఉంది?

కొన్ని దశాబ్దాల క్రితం రసాయన శాస్త్రజ్ఞులు ఒక తెల్లని పొడిని కనుగొన్నారు ఈ పొడిని తిని కొంత మంది 'చేదుగా ఉంది' అన్నారు. మరికొంతమంది దానికి 'రుచిలేదు' అన్నారు. శాస్త్రజ్ఞులకి ఈ పొడి విషయంలో సహజంగానే కుతూహలం ఎక్కువై పరిశోధనలు చేశారు. ఒక పదార్ధానికి ఉండే రుచి బాహ్యఅంశాల మీద ఆధారపడి ఉండదనీ, దానిని రుచి చూస్తున్న వ్యక్తి స్వాభావిక, అంతర్గత లక్షణాలను బట్టి ఉంటుందనీ తెలుసుకొన్నారు. 'జిహ్వకో రుచి, పుర్రెకో బుద్ధి' అన్న సామెతలో ఎంత సత్యం ఉందో, దాన్ని మనం ఎంత అర్ధవంతంగా వాడుకొంటున్నామో ఈ చర్చవల్ల తెలుసుకోవచ్చు.

కాంతి గురించి మరికొంచెం లోతుగానూ నిశితంగానూ తెలుసుకోవటానికి ప్రయత్నిద్దాం. కాంతికి కారణం ఎలక్ట్రానులేనని ఈ రోజులలో అందరికీ తెలుసున్న విషయం హైడ్రోజన్ పరమాణు వర్ణ పటాన్ని ఉదాహరణగా తీసుకొందాం. హైడ్రోజన్ పరమాణువు కేంద్రకంలో ఒక ప్రోటాను ఉంది. దాని చుట్టూ ఎలక్ట్రాను తిరుగుతోంది. ఎలక్ట్రాన్ నీలంగా ఉండదు; ఎరుపుగా ఉండదు; ఆకుపచ్చగానూ ఉండదు. అసలు దానికి రంగు ఉండదు. ప్రోటానుకీ రంగులేదు, ఎలక్ట్రానూ, ప్రోటానూ కలసి హైడ్రోజన్ పరమాణువుగా రూపొందినప్పుడు, అటువంటి పరమాణువు ఒక ప్రత్యేకమైన విద్యుదయస్కాంత కిరణాన్ని ఈయగలదు. స్పెక్ట్రా స్కోప్‌తో హైడ్రోజన్ వర్ణపటాన్ని పొందవచ్చు ఈ పటాన్ని చూసిన పరిశీలకుడికి ఎరుపు, ఆకుపచ్చ, నీలం, వయొలెట్ రంగుల అనుభూతులు కలుగుతాయి. ఈ అనుభూతులకు కారణమైన, శరీరధర్మ ప్రక్రియలలో ఎక్కడా రంగు ఉండదు. నాడులకు రంగులేదు. ఉత్తేజిత నాడులకూ రంగు ఉండదు.

పరమాణు వర్ణ పటంలో కనిపించే వర్ణపట్టీలు, కాంతి భౌతిక లక్షణాలను తెలుసుకోడానికి ఉపయోగపడే ప్రధమ సమాచారమే కానీ అదే పూర్తి సమాచారం కాదు. నిజానికి రంగు అనుభూతి కాంతి తరంగాల యొక్క తరంగదైర్ఘ్యం వివరాలను చెప్పలేదు. కన్ను చూసే వర్ణ పట్టీ భౌతికశాస్త్రజ్ఞుని దృష్టిలో ఏక వర్ణ పట్టీకాదు, ఒక వర్ణంలో ఉన్న వన్నెలను విడివిడిగా గుర్తించలేని కంటి అసమర్ధతతో శాస్త్రజ్ఞుడు రాజీపడలేడు. అందువల్ల వర్ణ పట్టీ గురించిన పూర్తి సమాచారాన్ని పొందటానికి అతను 'అనుభూతిని' ప్రక్కకు నెట్టేస్తాడు ఏకవర్ణకాంతిని పొందటానికి తగిన విధంగా అతను తన స్పెక్ట్రాస్కోపు **(Spectra Scope)** లో అమరికలను మారుస్తాడు.

కాంతి భౌతిక లక్షణాలని ఇంకా వివరంగా తెలుసుకోవడానికి శాస్త్రజ్ఞుడు ప్రత్యేకమైన స్పెక్ట్రాస్కోపు (Spectra scope)ని వాడుతాడు. ప్రిజమ్ (Prism) కి బదులుగా Diffraction grating ని వాడుతాడు. ధృవిత కాంతిని కన్ను చూడలేదు కనక శాస్త్రజ్ఞుడు ఇటువంటి పరిశీలనలకు నికాల్ ప్రిజమ్‌నివాడుతాడు అతి నీలలోహిత, పరారుణ కిరణాలతో ప్రయోగాలు చేసేటప్పుడు అతను Photo graphic plateని వాడుతాడు. ఇవన్నీ అందరికీ తెలుసున్న విషయాలే! ఇక్కడ ముఖ్యంగా నేను చెప్పదలచుకొన్నది ఏమిటంటే, శాస్త్ర పరిశోధనలో సాంకేతికతను మెరుగు పరుస్తున్న కొద్దీ, క్రమక్రమంగా పరిశీలకుని కంటి స్థానాన్ని శాస్త్ర పరికరం ఆక్రమించుకొంటుంది. కానీ జాగ్రత్తగా ఆలోచించి చూస్తే ''పరికరం'' పరిశోధనలో మొదటి నుంచీ ఉంటూనే ఉంది అని తెలుస్తుంది. అత్యంత ఆధునిక పరికరం పరిశీలకుని కంటిని పూర్తిగా గెంటివేసి, పరిశోధనలో తానే సంపూర్ణ అధిపత్యం వహించగలదా? అలా ఎన్నటికీ జరగదు. ఇంద్రియాజ్ఞానాన్ని ఉపయోగించుకోకుండా శాస్త్ర పరిజ్ఞానం అభివృద్ధి చెందటం అసాధ్యం. శాస్త్రజ్ఞుడు తన పరికరం సరిగ్గా పనిచేస్తుందో, లేదో నని పరీక్షలు చేస్తాడు. ఇటువంటి పరీక్షలకు ఒక్కసారి అతను ఆ పరికరాన్ని తయారు చేసి ఇచ్చిన కర్మాగారం ఇచ్చే ప్రామాణికతా పత్రం మీద ఆధారపడతాడు. కర్మాగారంలోని పనివారు వివిధ స్థాయిలలో వారి వారి ఇంద్రియ జ్ఞానాలను వినియోగిస్తూనే ఆ పరికరం ప్రమాణికతను నిర్ధారిస్తారు. ఫోటో మెట్రిక్ రికార్డింగ్ పద్ధతి ప్రస్తుతం అత్యంత ఆధునికమైన విధానం. ఇది చిత్రాలను బాగా పెద్దవిగాచేసి అత్యంత సూక్ష్మ సమాచారాన్ని కూడా అందిస్తుంది. దీనిని చదివి అర్థం చేసుకోడానికైనా శాస్త్రజ్ఞుడికి 'కన్ను' కావాలి కదా! శాస్త్ర పరికరాలు ఎంత కచ్చితమైన సమాచారాన్ని ఇచ్చినా పరిశీలకుడు చదవలేని నాడు అది నిరర్ధకమే కదా!

మళ్లీ మన చర్చ మొదటికే వచ్చింది. మానవ ఇంద్రియాలు నేరుగా శాస్త్రజ్ఞుడికి ఇచ్చే సమాచారంలో అనుభూతికి సంబంధించిన భౌతిక లక్షణాలు ఉండవు. ఇంద్రియానుభూతులను ఉపయోగించుకొంటూ రూపొందే శాస్త్ర పరిజ్ఞానంలో ఆ అనుభూతులు ఉంటాయని భావించడం సహజమే. కానీ యదార్థానికి శాస్త్రీయాంశాలలో ఇంద్రియానుభూతుల జాడ ఎక్కడా కనిపించదు. ఈ విషయాన్ని క్రీ.పూ. 5వ శతాబ్దంలోనే గ్రీకు దార్శనికుడు డెమోక్రటిస్ గుర్తించాడు. అతను మానవ ఇంద్రియాలకీ, మేధస్సుకీ '' ఏది యదార్థము'' అన్న విషయంపై జరిగిన సంవాదాన్ని ఇలా చెప్పాడు.

''నువ్వు ఉంది అని చెపుతున్న రంగు బాహ్యామైనది. తీయదనం బాహ్యామైనది. చేదు బాహ్యామైనది. ఇవన్నీ వాస్తవాలు కావు. యదార్థంగా ఉన్నవి పరమాణువులు, శూన్యమే సుమా'' - అని మేధ, ఇంద్రియాలతో అంది.

నీ ''పరిజ్ఞానానికి కావలసిన ఆధారాలకి మేము నీకు గుదిగుచ్చి ఇచ్చిన సమాచారాలను వాడుకొంటున్నావు. ఆ విధంగా నువ్వు మాకు ఋణపడుతున్నావ్. ఓ మందబుద్ధీ! నీగెలుపులోనే నీ ఓటమి ఉంది సుమా.'' అంటూ ఇంద్రియాలు మేధకు బదులు చెప్పాయి.

**Reference : 1. The Mystery of the Sensual Qualities Erwin Shor 'o'dinger.**

# జీవ పరిణామ క్రమం - దేవుడు

– డా॥ దేవరాజు మహారాజు

విజ్ఞాన శాస్త్రం విశ్వాసం లోంచి అభివృద్ధి చెందింది. అయితే అది యధార్థంగా ఒక రూపు దిద్దుకున్నప్పుడు సర్వ జనావళికి అందుబాటులో కొస్తుంది. దాన్ని ఎవరు నమ్మినా నమ్మక పోయినా అది అందరి సేవకై ఎదురు చూస్తుంది. మతం, దేవుడు కూడా విశ్వాసలే! అవి విశ్వాసాలు విశ్వాసాలుగానే ఉండి పోతున్నాయి. వాటి ఫలితాలు వాస్తవాలుగా అందరి అనుభవంలోకి రావడం లేదు. వాటిమీద గురి ఉన్న వారికి, నమ్మకం పెంచుకున్న వారికి వాటివల్ల ప్రయోజనం కలుగుతోందన్న భ్రమ ఉంటుందేమో తెలియదు.

ఒక మతం మరో మతం వారికి, ఒక దేవుడు మరో దేవుడికి ఇష్టం ఉండక పోవచ్చు. ఇష్టం లేకపోబట్టే ఎన్నో అనర్థాలు జరుగుతున్నాయి. విజ్ఞాన శాస్త్రానికి సంబంధించి, ఇష్టా ఇష్టాలకు తావు లేదు విభజనలు లేవు. అడ్డు గోడలు లేవు. ఒక మందు బిళ్ళ ఉందను కుందాం. అది అందరికీ సమానంగా ఒకే విధంగా పని చేస్తుంది తప్ప, అది వాడుతున్న రోగి ఏ కులం వాడు, ఏ గోత్రంవాడు, ఏ జాతీయుడు, ఏ భాష మాట్లాడతాడు, వాడి ఆర్థిక స్థితిగతులేమిటి? అని ఆలోచించదు. దానికి ఆ అవకాశమే లేదు. విజ్ఞాన శాస్త్రంలోనూ అభిప్రాయ భేదాలు, సిద్ధాంతాల గొడవలు, భిన్నమైన ఫలితాలు తప్పకుండా ఉంటాయి. అది ఒక దశ వరకే ఆ తర్వాత విజ్ఞానం ప్రాయోగిక పరిజ్ఞానంగా మారి మానవాళి ఉపయోగంలోకి వచ్చేసరికి దానికి ఒక సార్వజనీనత దానంతట అదే ఆపాదించుకుంటుంది.

దేవుడు మనిషిని పుట్టించాడా? మనిషి దేవుణ్ణి కల్పించాడా? అనేవి అనాది కాలంగా వస్తున్న రెండు ప్రశ్నలు. ఈ రెండూ ఉత్తర దక్షిణ ధృవాల్లాంటివి. దేవుడు మనిషిని పుట్టించాడని నమ్మేవారికి మనం చెప్పేదేం లేదు. అయితే దానికి ఆధారాలు మాత్రం ఏవీలేవని ఖచ్చితంగా చెప్పాల్సి ఉంటుంది. మనిషి దేవుడికి ఒక రూపం ఇచ్చాడని జీవ పరిణామం పైగౌరవమున్నవారు సులభంగా గుర్తించ గలుగుతారు. ''ఆంత్రపో మార్ఫిజం'' గురించి ఏ మాత్రం తెలుసుకున్నా, మన దేవుళ్ళందరూ మానవాకారాల్లోనే ఎందుకున్నారో అర్థమవుతుంది. జీవ పరిణామ సిద్ధాంత దృష్ట్యా జీవి నీటిలో పుట్టింది. నీటిలో పెరిగింది. మెల్లగా భూమిపైకి వచ్చింది. ఉభయ చరంగా బతికింది. నేలమీద పాకింది. గాల్లో ఎగిరింది. చెట్లమీద విహరించింది. గుహల్లో చేరి సమాజాలు ఏర్పరుచుకుంది.

హిందూ పురాణ గ్రంథాల ప్రకారం దేవుడివి దశావతారాలు. మత్స్యావతారం, కూర్మావతారం, వరాహావతారం, నృసింహావతారం, వామనావతారం, పరుశురామావతారం, రామావతారం, కృష్ణావతారం, బుద్ధావతారం, కలికావతారం. వీటిని పరిశీలిస్తే మన పూర్వీకులు జీవ పరిణామ సిద్ధాంతాన్ని కొంతలో కొంత గణనలోకి తీసుకున్నారనే అనిపిస్తుంది. చేపలు, సరీసృపాలు, పక్షులు, క్షీరదాలు, ఒక వరుసలో రూపొందుతూ వచ్చాయని వైజ్ఞానికులు భావిస్తున్నారు. అవతారాలు కూడా ఆవరుసలో వుండడం

గమనించదగ్గ విషయం మత్స్యం (చేప) కూర్మం (సరీసృపం) వరాహం (క్షీరదం). అలాగే ఉభయచరాలు, కన్నెక్టింగ్ లింక్స్ (అనుసంధాన జీవులు) ఉన్నాయి. బహుశా వీటిని చూపడానికే వరాహాన్ని, నరసింహాన్ని ఏర్పరచి ఉండొచ్చు. వరాహం నీటి మడుగులోనూ, నేలమీదా జీవిస్తుంది. జంతువు - మనిషి కలయికకు, నరసింహం సంకేతంగా నిలుస్తుంది. జీవశాస్త్రపరంగా ఇలాంటి అనుసంధాన జీవి మనకు ఎక్కడా కనబడదు. కాని సరీసృపాలకు-పక్షులకు మధ్య ఆర్కియాప్టరిక్స్, సరీసృపాలకు-క్షీరదాలకూ మధ్య డక్ బిల్డ్ ప్లాటిపస్ వంటి కొన్ని జంతువులున్నాయి. ఇలా రెండు జాతుల లక్షణాలతో మూడో జాతి జీవులు పుట్టడమన్నది మనకు జంతువుల్లోనూ, వృక్షాల్లోనూ ఉన్నదే. బహుశా ఇలాంటి అంశాన్ని ప్రస్ఫుటంగా చూపించడానికే నరసింహావతారాన్ని ఏర్పరచి ఉండొచ్చు. ఆ తరువాత ఉన్న అవతారాలు గమనిస్తే అవన్నీ పూర్ణ మానవుడి రూపాలు! వామనుడు, పరుశురాముడు, రాముడు, కృష్ణుడు వగైరా. చిన్నదైన వామన రూపం ఎదిగి ఆ తరువాత రాముడిగా పరిపూర్ణ మానవ రూపం సంతరించుకోవడం గమనించాలి.

రాజులను సంహరించడమే ధ్యేయంగా పరుశురాముడు అరణ్య జీవనం సాగించాడు. రాముడు రాజుగా అరణ్య జీవనంలో మునిగినా, చివరి దశలో యోధుడిగా వైవిధ్యం ప్రదర్శించాడు. కృష్ణుడు రాసలీలకు విశ్వప్రేమకు, రాజనీతికి - యుద్ధనైపుణ్యానికి సంకేతంగా నిలిచాడు అంతేకాదు జీవం అనంతమైనది, దానికి చావులేదు, అది పుడుతూ గిడుతూ ఉంటుంది అని చెప్పిన గీతకారుడు కూడా!

ఈ అవతారాలలో ఒక క్రమం ఒక ఎదుగుదల కనిపిస్తుంది. అరణ్య జీవనం లోంచి, సాంఘిక జీవనం లోకి వచ్చి అందులో రాజకీయ, ఆర్థిక సామాజిక చైతన్యాన్ని సాధించిన వైనం స్పష్టంగా కనిపిస్తుంది. ఇదంతా మానవుడు సాధించిన ప్రగతే. తను సాధిస్తూ వచ్చిన ప్రగతిని, తను పరిశీలిస్తూ వచ్చిన జీవ పరిణామాన్ని, జీవ చైతన్యాన్ని మనిషి దేవుడి అవతారాలకు అన్వయించాడని చెప్పడానికి ఈ వివరణ చాలనుకుంటాను. అవతారాలన్నీ మనిషి కల్పనలే గనక, దేవుడి రూపాలన్నీ మానవాకారంలోనే ఉన్నాయి.

ఒక ఆవు, ఒక సింహం, ఒక మేక దేవుణ్ణి ఎలా దర్శిస్తున్నాయో మనకు తెలియదు. బహుశా అవి వాటి వాటి ఆకారాల్లోనే దేవుణ్ణి తలుస్తూ ఉండొచ్చు - మనిషి అడవి జంతువులకు భయపడి - వాటిని అధ్యయనం చేయలేక సర్పాల వంటి జంతువుల్ని పూజిస్తూ వున్నా, మళ్ళీ అత్యున్నతమైన గౌరవస్థానం మానవ మాత్రులకే ఇచ్చాడు. అంటే ఇక్కడ రెండు విషయాలు స్పష్టమౌతున్నాయి. తనకు అంతుపట్టని శక్తి ఏదో ఉంది - అని మనిషి నమ్మాడు. అలాగే ఆశక్తిని మానవాకారంలోనే దర్శించాడు. శివుడు, ఆదిశక్తి వంటి రూపాలు కూడా మానవాకారాలే కదా? ప్రపంచాన్ని సృష్టించగల శక్తి, ప్రపంచాన్ని ధ్వంసం చేయగల శక్తీ మనిషిలోనే ఉంది. భగవంతుని 'అంశ' అనేది మరెక్కడో లేదు. మనిషిలోనే ఉందని దీని వల్ల అర్థమవుతూ ఉంది.

దేవుణ్ణే రూపొందించుకోవడమే కాదు, దేవాలయాల నిర్మాణం కూడా మానవ మేధస్సు రూపకల్పన చేసిందే. గుట్టలమీద, కొండలమీద, దట్టమైన అరణ్యాలలో, స్వచ్ఛమైన గాలీ నీరు లభ్యమయ్యే చోట అన్ని కాలుష్యాలకు దూరంగా మనిషి దేవాలయ నిర్మాణాలు చేపట్టడం గమనించదగ్గ విషయం. ఎంతటి పురాతనమైన గొప్ప ఆలయాలైనా అవన్నీ మానవ నిర్మాతాలే కాని, దేవతలు తమకు తాము నిర్మించుకున్నవి కావు. రాళ్ళతో నిర్మింపబడ్డ ఆనాటి ఎత్తైన స్తంభాలు, సభా మండపాలు మనపూర్వుల శాస్త్ర సాంకేతిక, పరిజ్ఞానాన్ని వెల్లడిస్తున్నాయి. అంతేకాదు వారి కళారాధనని, హృదయ సౌందర్యాన్ని తరతరాలకూ పరిచయం చేస్తూ, వస్తున్నాయి.

అద్భుతమైన శిల్పసంపద, సుమధురమైన సంగీతం, విలువైన వలువలు, ఆబాల గోపాలానికి ఇష్టమయ్యే తీర్థ ప్రసాదాలు, ఇలా ప్రతి అంశమూ ఎంతో ఆలోచించి, విచక్షణ చేసి, ఏర్పరుచుకున్నదే గాని, అల్లాటప్పాగా చేసింది కాదు. మనిషి తనకు తెలిసిన విజ్ఞాన సర్వస్వాన్ని అంతా దేవాలయ నిర్మాణంలో, నిర్వహణలో ఉపయోగించాడు శుభ్రతకు అత్యంత ప్రాధాన్యమిచ్చాడు. అందుకే వేల జనం ఒక క్రమపద్ధతిలో, కొన్ని కట్టుబాట్లకు లోబడి ఆలయాలను దర్శిస్తున్నారు ఆనందిస్తున్నారు. అందువల్ల దేవుడినే కాదు, దేవాలయాలను కూడా మనిషి వైజ్ఞానికంగా అన్నిహంగులతో నిర్మించాడని అర్థం చేసుకోవాల్సి ఉంది. దేవుడికి కేంద్రకం ముమ్మాటికీ మనిషే!

---

*(Continued from 130)*

- Recession : When a neighbour loses his job - as opposed to depression, which is when you lose yours. (Ronald Reagan)
- Specialist : A person who knows more and more about less and less. (William James Mayo)
- Tact : The ability to describe others as they see themselves. (Abraham Lincoln)
- Undertaker: The last man to let you down. (Jimmy O'Dea)
- Vocation : Any badly paid job which someone has taken out of choice (Mike Barfield)
- Wedding : A funeral where you can smell your own flowers (Eddie Cantor)
- Xerox : A trademakr for photocopying device that can make rapid reproductions of human error perfectly.
- Youth X · A trademark for a photocopying device that can make rapid reproductions of human error perfectly.
- Zoo : A place devised for animals to study the habits of human beings. (Oliver Herford)

# మనోవైజ్ఞానిక తాత్వికుడు బి. యఫ్.స్కినర్

– శివలింగం

మనస్తత్వ శాస్త్ర మేధావులలో శిఖరాగ్రగణ్యుడు చివరివాడు స్కినర్ (Burrus Frederic Skinner) 20 మార్చి 1904లో జననం. 18 ఆగస్టు 1990లో మరణం అపారవైదుష్యంతో వెలుగులు విరజిమ్ముతూ విశాలపడుతూ పురోగమించాడు, బోస్టన్‌లో 98వ వార్షిక సదస్సులో అమెరికన్ సైకలాజికల్ అసోసియేషన్ (APA) వారు సైకాలజీకి ఒక జీవిత కాలం అపారమైన కృషి చేసినందుకు ఘనంగా కీర్తించారు. సన్మానించారు. 86 యేట లుకేమీయావ్యాధి వల్ల మరణాన్ని గుర్తించాడు. గౌరవపురస్కారం 10 ఆగస్టు 1990లో జరిగింది. 17 ఆగస్టు 1990లో ప్రసంగ వ్యాసాన్ని రాశాడు. మరణంలో రాసిందే. ఆ వ్యాసం 1990 నవంబరులో అమెరికన్ సైకాలజిస్టు పత్రికలో వచ్చింది. స్కినర్‌చివరి ఉపన్యాసం 1971లో APA ఏర్పాటు చేసిన సమావేశంలో యిచ్చాడు. 1971లో ఆ సమావేశానికి 1500 మంది హాజరయారు. తలవంచుకుని మాట్లాడుతుంటే చదువుతున్నాడనుకున్నారు. చివరివరకు నోట్సు కూడా రాసుకోకుండా ఉపన్యసించాడు. స్టేజిమీద వున్నావారు ఊపిరబిగబట్టివిన్నారు. మాటలు స్పష్టం. తర్కం బలంగా వుంది. విశ్వాసం దృఢం.

స్కినర్ ప్రవర్తన వాదానికి (Behaviorism) అంకితమైనవాడు. మానవ ప్రవర్తనను మనస్సు చేతనం ద్వారా వివరించడం మానేసి చర్య ప్రతిచర్యల సామస్త్యంగా భావాంచి వాటినే మనో విజ్ఞానానికి ఆధారం చేసుకుని అధ్యయనం చేస్తుంది. పావలోవ్ నిబంధి త ప్రతిచర్యల మీద జరిపిన ప్రయోగాలు. జె.బి.వాట్సన్ ప్రవర్తనాధ్యాయనంలో చేసిన కృషి దీనికి మూలం. ఆలోచన ఉద్వేగాలను కూడా అంతర్భూత ప్రవర్తన గానే ప్రవర్తనవాదులు వ్యాఖ్యానిస్తారు. విధానాత్మక ప్రవర్తన వాదులనీ, అధి కారిక ప్రవర్తనా వాదులని రెండు శాఖల వారున్నారు. మొదటి శాఖవారుచేతనాన్ని నిర్లక్ష్యం చేసి ప్రవర్తననే వస్త్వాశ్రయంగా అధ్యయనంచేస్తారు. రెండో శాఖవారు చేతనాన్ని పూర్తిగా తిరస్కరిస్తారు. స్కినర్ కీర్తికి సరితూగగలిగిన వాడు ఒక్క ప్రాయిడ్ మాత్రమే. స్కినర్ రాతలు భావనాత్మకం. భాషాబేషజం అనుభవవాద ఆధారితం అన్నారు. పరిశోధన పనికాదు. పామర జనం కోసి రాసిన రాతలూ వున్నాయి.

మనస్తత్వ శాస్త్రం కాదు స్కినర్ ప్రథమంగా ఎన్నుకొన్నది. సృజనాత్మక రచయిత కావాలనుకుని హామిల్టన్ కాలేజి నుండి బి.ఏ. డిగ్రీ తీసుకొన్నాడు. రాబర్టు ఫ్రాస్ట్ ప్రోత్సాహించినా సాహిత్యంలో ఎదగలేకపోయాడు. జాన్ ది. వాట్సన్ ప్రవర్తనా వాదం మీద బెట్రాండురసెల్ రాసిన వ్యాసాలు చదివి సైకాలజిస్టు కవాలనుకున్నాడు.

స్కినర్ రాసిన గ్రంథాలు :

WALDEN TWO 1948
BEYOND FREDOM AND DIGNITY 1971
PARTICULARS OF MY LIFE 1976
THE SHAPPING OF A BEHAVIORIST 1979
A MATTER OF CONSERQUENCES 1984

చివరి మూడు గ్రంథాలు స్కినర్ ఆత్మకథ రెండవ పుస్తకం బెస్ట్ సెల్లర్, మొదటి గ్రంథం రెండు మిలియన్ల కాపీలు ప్రచురణ పొందింది సాహిత్యమూ, సౌకాలజీని కూడా సుసంపన్నం చేశాడు హార్వార్డు, మిన్నెసోలూ, ఇండియాని యూనివర్శిటీల్లో పనిచేశాడు నెర్వస్ సిస్టమ్ జోలికి పోకుండానే జంతుప్రవర్తనను విశదీకరించడాన్ని బట్టి పావ్‌లోవ్‌ను, జి యస్ షెరింగ్‌టన్‌లను తోసిపుచ్చడమైనది స్కినర్ మీద కొందరి ప్రభావం వుంది.

ప్రవర్తనపై సైద్ధాంతిక విశ్లేషణకు ఫిజియాలజి అక్కరలేదన్నాడు. విశదీకరణ కంటే నియంత్రణకు ప్రాధాన్యతనిచ్చాడు. జన్యుశాస్త్రాన్ని స్వీకరించాడు ప్రయోజనాత్మక ప్రవర్తనా విశ్లేషణను స్కినర్ అనుసరించాడు కారణ సంబంధాల విశ్లేషణగా అర్థం చేసుకోవాలి ఆకలేస్తే అన్నంతినడం, కోపం వస్తే ఉద్రేక పడటం సహజ గుణాలు. ఆకలి, ఆగ్రహాలకు గల కారణాల పూర్వ పరిస్థితులను సరిగా అవగాహన చేసుకుని వివరించాల్సివుంటుంది. స్కినర్ మౌలిక అనుభవవాదం పరిసరాలను ఆంగికవాద ప్రభావాన్ని పరిశీలిస్తుంది మానవుని ఉదాత్త లేదా నేర ప్రవృత్తిని అతని నియంత్రిత చరిత్ర ద్వారా వివరించ వచ్చు పాశ్చాత్య పండితులు, ఆలోచనాశీలురు, మానవతా వాదులు స్కినర్ ప్రవచించిన ప్రవర్తనా విశ్లేషణను విమర్శించారు. ఆర్థర్ కోస్లర్ ప్రవర్తనా వాదాన్ని "a monumental triviality అన్నాడు అమెరికా రాజకీయ మేధావులు దూషించారు వారిలో ముఖ్యంగా కాంగ్రెస్ సభ్యుడు గల్లాఘెర్, వైస్‌ప్రెసిడెంటు స్పిరో అగ్న్యూ. తరవాత కాలంలో ఇరువురూ నేరస్తులుగా రుజువై ఒకరికి జైలు శిక్ష పడితే మరొకరు వైస్ ప్రెసిడెంటు పదవికి రాజీనామా చేయవలసివచ్చింది. కొందరు స్కినర్‌ను అపార్థం చేసుకున్నా పట్టించుకోకపోవడం ఆశ్చర్యం కలిగిస్తుంది అనారోగ్యకర అవాంఛనీయ ఆచారాలు సంస్కృతిని బ్రతికించలేవు. మంచి ఆచారాల వల్ల చిరకాలం జీవిస్తుంది సంస్కృతి. గ్రీకు, రోము నాగరికతలు సంస్కృతి క్షీణించినా భారతీయ సంస్కృతి సజీవంగావుండటం గమనార్హం. బలం కలిగినవే నిలుస్తాయన్న పరిణామ వాదాన్ని సామాజానికి సంస్కృతికి వర్తింపచేశాడు. ఒకడు ఇతరుల్ని నిగ్రహించలేడు. ఇతరులు వాడిని నిగ్రహించినపుడు వాడు ఇతరుల్ని నిగ్రహించగలడు. యజమాని - బానిస, విజయుడు- విఫలుడు మధ్య సంబంధాలు నిగ్రహంతో వుండాలి. సంస్కృతి మానవ ప్రవర్తనోత్పాదమే కాని వేరు కాదు. స్కిన్నర్ "There is no place in a Scientific analysis of behaviour for a mind or self అన్నాడు. నిశ్చాయక సూత్రాలు పూర్తి నిజాలు కావు. విశ్వాసానికి సత్యానికి ముడిపెట్టాల్సిన అవసరం లేదు. విశ్వాసాలన్నీ నిజాలు కావు. నిజాలు విశ్వాసాలు కావు. సైన్సు, పారాసైకాలజీ, దైవమూర్తి వంటి వాటిని కొందరు విశ్వసిస్తారు. నీ విశ్వాసాలెటువంటివో ఇతరులవీ అటువంటివేనని అంగీకరించాలి. రూసోకి మానవుడు స్వతంత్రంగానే పుట్టినా సంకెళ్ళలోనే వున్నట్లు కనిపించాడు. మార్క్స్ సంకెళ్ళను తెంచుకోమన్నాడు. మానవమనస్సును ఎవడూ బంధించలేడు. మానవ స్వేచ్ఛను బాధ్యతను ఆచరణ స్థాయిలో అంగీకరించినా తాత్విక స్థాయిలో అంగీకరించ లేదు స్కిన్నర్. Skinnermain Brand of Psychology అనేది మనకు యిచ్చిపోయాడు. మనస్తత్వ మేధావుల్లో చివరివాడు. స్కినర్ కృషి మనస్తత్వ శాస్త్ర రంగంలో మరపురానిది.

# మానవతా మూర్తి - కృష్ణశాస్త్రి

- డా॥ విజయ బక్ష్

19వ శతాబ్దపు తుది దశాబ్దుల్లో ఆంగ్లేయ విద్యా ప్రాభవం తెలుగు సాహిత్యం పైన చూపింది మద్రాసు, కలకత్తా, బొంబాయిల్లో విశ్వవిద్యాలయాల స్థాపనతో దేశంలో చాల మంది ఆంగ్ల విద్యనభ్యసించారు. చాల మటుకు 'గుమాస్తా' లుగ స్థిరపడేందుకు ఆంగ్లం చదివిన వారు కొందరైతే ఆంగ్ల కవిత్వంలోని గొప్పదనాన్ని అనుకరించినవారు కొందరు. ఆంధ్రదేశంలో ఒకవైపు మధ్యందిన మార్తాండుడిలా విజృంభించి వీరేశలింగం కొనసాగిస్తున్న సంస్కారణోద్యమం; కాకినాడ నుండి ఋషితుల్యుడు, కారుణ్యమూర్తి రఘుపతి వెంకటరత్నం నాయుడు చేపట్టిన మానవతా మహోధ్యమమైన బ్రహ్మసమాజం ఆనాటి యువకులను బాగా ఆకర్షించాయి.

బ్రహ్మో సమాజానికి ఆయువు పట్టయిన సర్వమానవ సమానత, వర్ణభేద నిరసనం, మానవ సేవే మాధవ సేవ అనే అంశాలు. అభ్యుదయ గాములయిన యువకులను బాగా ఆకర్షించాయి అటువంటి వారిలో ఆంధ్రదేశం గర్వించదగ్గ మహాకవిగా, మానవతా మూర్తిగ రూపు దిద్దుకొన్నవాడు దేవులపల్లి కృష్ణశాస్త్రి .... కుప్పలు తెప్పలుగ కవులు బండ్ల కొద్ది రాసి పారేస్తున్న ఈ రోజుల్లోను 'కృష్ణశాస్త్రి కవితలా.. ...' అని చెప్పుకోదగ్గ కవిత్వాన్ని అందించినవాడు ఆయన. భావ కవితా యుగపు రారాజు.

ప్రాచీన సంకుచిత భావాలను నిరసించే బ్రహ్మసమాజ ప్రభావంతో సంస్కార్త అయిన ఆదిపూడి సోమనాధరావు ప్రభావానికి లోనయినాడు హైస్కూలు విద్యార్థిగ. ఆ తర్వాత పిఠాపురం రాజాకళాశాలలో బ్రహ్మర్షివెంకటరత్నం నాయుడు అంతేవాసిత్వంలో పరిపూర్ణ మానవుడిగ రూపు దిద్దుకొన్నాడు. కీట్సు, వర్డ్సువర్తు, షెల్లీ, బైరన్ కవుల రచనలు, శాంతినికేతన్‌లో పలువురితో సాంగత్యం, సూఫీ కవుల ప్రేమతత్వం, టాగూర్ హృదయంలో ధ్వనించే అలౌకిక ప్రేమ తత్వం ఆయనకు నవ్యాంధ్ర కవులలో విశిష్టస్థానాన్ని చేకూర్చి పెట్టింది.

మానవతకు మోసులెత్తిన నాయుడుగారి శిష్యరికంలో సంఘసంస్కారణ కార్యకలాపాల్లో చాల ధైర్యంగ పాల్గొన్నాడు. హరిజనోద్యమంలో తిరగటం వల్ల కొన్ని సంవత్సరాల పాటు బంధువులు, బ్రాహ్మణులు ఆయన్ని కులం నుండి వెలివేసారు. నాయుడుగారి ప్రభావం వల్ల కళావంతుల వివాహాల్లోను పాలు పంచుకున్నాడు. మహాత్ముని హరిజనోద్ధరణం కంటే ముందే పిఠాపురం; కాకినాడల్లో, హరిజన బాల బాలికలకు ప్రత్యేక హాస్టళ్ళు నెలకొల్పబడ్డాయి. కులాంతరులతో సహపంక్తి భోజనాలు నిర్వహింప బడ్డాయి. పిఠాపురం రాజాగారి వితరణశీలత, నాయుడుగారి ప్రగతిశీల దృకృధథమే వీటన్నిటికి కారణం. అసలే కారుణ్యం, మానవత్వం మూర్తీభవించిన కృష్ణశాస్త్రి, ప్రకృతి ప్రేమ, మానవుల పట్ల అనురాగంతో స్పందించి పోయేవాడు. అందుకే ఆయన వెలయించిన అన్ని రచనల్లోను 'ప్రేమ' చిప్పిల్లితూ వుంటుంది.

దీన బాంధవుడు, అకళంక ప్రేమమూర్తి, విద్యార్థుల పాలిట కల్పతరువు అయిన వెంకటరత్నం నాయుడు తనను 'మనీషిగ' తీర్చిదిద్దినందుకు తన కృతజ్ఞతను వెల్లడించుకొంటు- 'నా యెదలో

త్వదీయ చరణమ్ముల చిహ్నములెన్న డేనియున్ మాయవు యే నిశీధపు తమస్సులు మాసినగాని' అంటారు. 'ఈ జడ జీవితమ్ము పలికించితివీ, యఘ పంక మందునంభోజము మొల్వ జేసితి వపూర్వము నీదయ'. అంటాడు. కృష్ణశాస్త్రి భక్తుడే . . కాని ఆ భక్తిలో సంకుచిత్వం, స్వార్థచింతన లేశమైన కనుపించవు. . విశ్వమానవ ప్రేమ, స్వేచ్ఛానురక్తి వెల్లడవుతాయి.

ద్వేషమున్న చోట దేవుండు వెలయిడు
మతులు గతులు తప్ప మతము లేదు -
ఒక్క కంట ప్రేమ, ఒక కంట సత్యమ్ము
వెలుగ, జగతి శాంతి నిలువ వలయు.

'శిధిలాలయమ్ములో శివుడు లేడోయి' అంటు భగవంతుడు గుడిలోని శిలా విగ్రహం కాడని 'వాడ వాడల వాడే జాడలన్నిటవాడె' ఇంటి ముంగిటవాడె, ఇంటిలో వాడే' అని ఇంటింటిలోను వాడే అంటంలో పరమాత్మ సర్వాంతర్యామి సుమా, గుడిలో 'బందీ' కాదు అని చెప్పే విశాల దృక్పథం వ్యక్తమవుతుంది. బ్రహ్మ సమాజకులు విగ్రహారాధనను నిరసిస్తారు. అందుకే ఆయన వ్యంగ్యంగా అంటాడు 'శిధిలాలయమ్ములో శిలను సందిటబట్టి పూజారి వానికై పొంచియున్నాడోయి' .

మనుషుల మధ్యగోడలు కట్టి మనుషులను విడదీసే మతం తనకు వద్దంటాడు. 'మతమన్నది నాకంటికి మసకైతే, మతమన్నది నా మనసుకు మచ్చైతే మతం వద్దు గితం వద్దు, మారణ హోమం వద్దు' ... అని మతాన్ని నిరసించాడు... ''కులందాటి మతం దాటి, కొద్దిగొప్పదాటి - సమ భోగం, సమభాగ్యం, సమ సంస్కృతి దాటి కొత్త శాంతి, కొత్తకాంతి భారతావని కిందు '' అని కోరుకొన్నాడు.

రాజారామ మోహనరాయలు ప్రతిపాదించిన స్వేచ్ఛా పిపాస, హేతుదృష్టి కృష్ణ శాస్త్రి కవితలో చోటు చేసుకొన్నది. రాయ్ మానవుని మహోన్నతుడిగా భావించాడు. ఆ భావాన్నే కృష్ణశాస్త్రి - 'వికసించే విధానమున మకుటధారి మానవుడే' అంటూ ఆవిష్కరించాడు 'మానవా! నవ మానవా! నీవు నిలచిన నెలవే కోవెల' అన్నాడు.

1918లో హరిజనులతో పంక్తి భోజనాల వల్ల వెలివేయబడ్డాడు. ఆయన. కులాన్ని నిరసిస్తూ

గుణము లేని వాని దే
కుల మైతే నేమి
తృణ మైతే నేమి శ్రీ
చరణ మంట నేని
మాలల మేమో పనికి
మాలిన వారము ఏమో!
శ్రీలలితేశ్వర గళసవ
మాలా కుసుమాల మేమొ!

అంటూ భగవంతుని మెడలో దాల్చే శ్రేష్ఠమైన మాలలతో పోల్చాడు. మతవైషమ్యాలకు, వైరాలకు, యుద్ధాలకు కారణం ఎక్కడో లేదు అన్ని మనిషిలో పుట్టే ఆలోచనలే అంటూ -

'మనిషిలోనే పెద్ద మడతుంది.

మనిషికే పెడ బుద్ధి పుడుతుంది'

అని మానవ స్వభావంలోని క్రూరత్వాన్ని చక్కగా విశ్లేషించి చూపాడు.

'లేదోయి నిదురలో లేదోయి సుగతి

చూడవా కనువిప్పి చూడవా జగతి' అంటూ

అజ్ఞానాన్ని నిద్రగాను, మెలకువను జ్ఞానంగాను ఆరోపించాడు.

'హాలికుడు' అనే గేయంలో శ్రమజీవియైన హాలికుని దుస్థితిని మన కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తూ దానికి అధి కారులు, ప్రభువులు, శ్రీమంతులు కారణమని అధిక్షేపిస్తాడు. 'నేలవైపు అదే పనిగ చూసే హాలికుడు వేల శతాబ్దుల ప్రేగులవల్ల వంగిపోయి, విశేష భూమి భారం క్రింద కృంగి పోయి, అణగి పోయి నేలవైపు అదే పనిగ చూస్తుంటాడు' అని కొయ్య - రాయి - ఎద్దు - వీటికి తోబుట్టువు వాడు' అని హాలికునిలోని స్తబ్దతకు వాపోయాడు. ఈ సమాజంలో అణగారి పోయిన వారిని ఎవరు లేవనెత్తుతారు అని ఆర్తితో ప్రశ్నిస్తాడు.

''అయ్యా అధికారులూ, ప్రభువులూ

సామంతులూ, శ్రీమంతులూ!

ఆ భగవంతునికిదా మన మర్పించుకునే ఉపద

ఆ వంగిన నడుమును ఎలాగు సరిచేస్తారు మీరు

ఆ కృంగిన భుజం ఎలాగున నిలబెడతారు మీరు

ఎవరు నేర్పుతారు వానికి వెలుగు కోసం పైకి చూడటం!,

కృష్ణశాస్త్రి కవిత్వంలోను, సినిమా పాటల్లోను సర్వత్రా ఆయన అభ్యుదయ దృక్పథం స్పష్టమవటమే కాక వచన రచనల్లోను ఆయన తన హృదయాన్నావిష్కరించటంలో కృత కృత్యుడయ్యాడు.

'బహుకాల దర్శనం' లో ఆయన సంఘం మీద చేసిన వ్యంగ్య విమర్శలో నిజమెంతో ఉంది. నేడు మన కంటికి కనపడుతున్న తారతమ్యాల విశ్లేషణ ఉంది. గొప్పవాళ్ళు నేరాలు, తప్పులు, అకార్యాలు చేసినా అవి మంత్రాంగం, రాజ్యాంగాలుగా కీర్తింప బడతాయి. దరిద్రుడు ఆ పనులేచేస్తే అవి 'నేరాలుగా, ద్రోహాలుగా, దొంగతనాలుగ చిత్రింపబడతాయి.

'రిక్షావాలా' కథలో అహ్మద్ రిక్షా తొక్కేవాడు. దరిద్రుడు. అతని వేషం వర్ణిస్తూ 'ఒక మోకాలి దగ్గర చిరిగి, కాళ్ళ అంచుల దగ్గర తుక్కు తుక్కయి రేగిపోయిన ఇజారు, వీపు మీద వంకర టెంకరగ వేసిన రూపాయి సైజు రెండు మాసికలతో బొత్తాల్లేని కమీజు......

అయినా అటువంటి అహ్మద్ కంటే నేనేమంత గొప్ప? ఏమంత దర్జా! ఇన్ని బట్టలూ, ఇన్ని పూతలూ, ఇన్ని చదువులూ, పదవులూ, సంస్కారాలు మున్నింటితో తెచ్చి పెట్టుకొన్న కృత్రిమపు హోదా' అంటాడు. అహ్మద్‌ని తన యింట్లో కుర్చీలో కూర్చో బెట్టుకోడం, అతని రెండు చేతులూ

పట్టుకొని కౌగిలించుకోవటం - ఇవన్నీ రిక్షావాలాలో కూడా తనలాంటి మనిషిని చూడటం, ఎవరినైన ప్రేమించగల ఔన్నత్యం వల్లనే.

'బూట్‌పాలిష్' కథలో నారయ్యని వర్ణిస్తూ

'నారయ్య బుజాలు కాదు - నడుము రవ్వంత వంగి వుంటుంది. ఆ వంగడం బరువు మోత వల్ల కాదు - నారయ్య నడుస్తున్నప్పుడు కాళీడుస్తాడు. ఆ కాళ్ళీడ్చడం అలసట వల్ల కాదు. నారయ్యది వంగిన నడుం వాళ్ళ జాతి. కాళ్ళీడ్చేజాతి. అంతే.. నారయ్య వయస్సెంతో నారయ్యకే తెలీదంటూ'

'మందికి మాత్రం వయస్సుండదు. అజ్ఞాతానికి చావు పుట్టుకలుండవు. లోకమందిరానికి పునాది కోట్లమంది సామాన్య జనం. సేధ భారంమోసే పునాది మనకు కనబడదు. కాని ప్రసాద సౌందర్యం చూచి 'బలే' అని కనుబొమలెగరేస్తాం. అంతే అది లోకపద్ధతి. తనకి మనకి కోట్ల మంది జనం లేరు. అంటే వాళ్ళుండినీ మనకు లేరు. వాళ్ళు లేనప్పుడు భగవంతుడు గూడ లేడు'' అంటూ ప్రభూ! ఇక్కడ నీచరణ పీఠం ఉంది. అనే రవీంద్రుని గీతాంజలి లోని భావనకు దగ్గరగ, దరిద్రుల దగ్గరకు, శ్రమజీవుల సమీపానను అక్కడ మాత్రమే కాదు - భగవంతుని వసతీ లోకం బహిష్కరించిన వాళ్ళ మధ్యనూ, పతితుల నడుమ కూడ భగవంతుడుంటాడు. వాళ్ళను వదల్లేడు 'God is a long suffering God' ఇంత చక్కగ, అర్థమయేలాగున గొప్ప సందేశాన్ని చిన్న కథలో చేర్చి చెప్పటం కృష్ణశాస్త్రివంటిగొప్పవ్యక్తికి మాత్రమేసాధ్యం. అంతే కాదు. ఇంకా భగవంతుని రజకునితోను, బట్టలకు రంగులు వేసేవాడితోను పోల్చాడు. భగవంతుడు రాళ్ళుకొడతాడు, పొలం దున్నుతాడు, అని చెప్తాడు. సర్వేసర్వత్రా ప్రతి మానవునిలో భగవత్స్వరూపం ఉందంటాడు.

కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ! అని చలం అన్నట్లుగానే చాలమంది విద్యార్థులు కృష్ణశాస్త్రి 'స్వేచ్ఛాగానం' లోని కొన్ని వాక్యాలను వింటూ ఇదే అపోహకు గురవుతున్నారు.

'దిగిరాను దిగిరాను దివి నుండి భువికి....
'నవ్వి పోదురుగాక నాకేటి సిగ్గు
నా ఇచ్ఛగాక నాకేటి వెరపు....

అనే వాక్యాలు మాత్రమే పరిగణనలోకి తీసుకొంటున్నారు. సామ్యవాదమని, సామాజిక స్పృహ అని చెప్పుకునే ఏ అభ్యుదయ కవులు, రచయితల కంటే కృష్ణశాస్త్రి తక్కువవాడు కాదు.... మహోన్నత మానవత్వం మూర్తీభవించిన మనిషి... మూఢాచారాలలో, ఇరుకు గోడల మధ్య నలిగిపోయే సంకుచితత్వాన్ని నిరసించాడు. జాతి, కుల, మతాలను నిరసించారు. మీదు మిక్కిలి ఆచరణలో చూపాడు... ఆయన భావ, అభ్యుదయ కవితా వాదాలను మించిన హృదయవాది. ఆయన కవిత్వం కూడ ఎల్లలులేని మానవ ప్రపంచాన్ని, కల్ల లెరుగని ప్రేమ వెల్లువని ప్రవహింప చేసింది.

ఆయనమాటల్లో - ''మనిషితో ఎడతెగని సావాసము, ప్రేమిస్తే ఆనందం, దవ్వు అయితే బాధతో కొట్టుకపోవడం ఇది నాకు తెలుసు. ఇది నామతం. నాకికవేరే మతం లేదు, కులం లేదు, నేను మనిషిని''.

# శ్రవ్యమాధురి

– డా. సంజీవదేవ్

ప్రకృతి శోభను చూస్తుంటే అనిపిస్తుంది, ఈ రంగులు, ఈ రూపాల్తు, ఈ వెలుగులు, ఈ నీడలు అన్నీ కూడా నాదమాధూరిలోకి మారి దృశ్యం అంతా శ్రవ్యంగా వినిపిస్తే ఎంత నందమయంగా వుంటుందో అని. చూడటం అనేది వినటంలోకి రూపాంతరం చెందితే గ్రుడ్డితనం వచ్చినాకూడ భయపడాలసిన అవసరం వుండదు. చెవుడు మాత్రం రాకుండా చూచుకోవాలి. రూపం కంటే నాదం ఎక్కువ తన్మయతను కలిగిస్తుంది. రంగులో కంటే రాగంలో ఎక్కువ రసానుభూతి లభిస్తుంది. రూపం పరిచిత జగత్తుకు చెందినట్లు, నాదం అపరిచిత జగత్తుకు చెందినట్లు తడుతుంది. రూపం కంటే నాదం ఎక్కువ నైరూప్య మైంది (Abstract) అని, రూపం కంటికి కనిపిస్తుంది. కంటికి కనిపించేది చాలాభాగం మిగతా ఇంద్రియాలతో ఎక్కువ సంబంధం కలిగి వుంటుంది. అంటే రూపం అనేది ఏదో ఒక వస్తువుతో అనుబంధాన్ని కలిగి వుంటుంది. వస్తువును కంటితో చూడడమే కాక ముక్కుతో వాసన చూడవచ్చు, జిహ్వతో రుచిచూడవచ్చు, చర్మంతో స్పృశించవచ్చు కూడ. అంటే రూపంలో ఈ గుణాలన్నీ పరోక్షంగానో అపరోక్షంగానో ముడిపడి వుంటాయి. నాదానికి ఈ గుణాలన్నీ లేవు. నాదం చెవికి మాత్రమే వినిపిస్తుంది కాని కంటికి కనిపించదు, ముక్కుకు, జిహ్వకు, చర్మానికి కూడ అందదు కనుకనే రూపం కంటే నాదం తక్కువ స్థూలం, ఎక్కువ సూక్ష్మం, తక్కువ జడమయం, ఎక్కువచైతన్యమయం. అందుకే రూపంకంటే నాదం ఎక్కువనైరూప్యమైంది. రూపం దృశ్యం, నాదంశ్రవ్యం. దృశ్యం పరిమితమైంది, నాదం అపరిమితమైంది. శ్రవ్యనాదం కలిగించేంత తన్మయతను దృశ్యరూపం కలిగించదు. అందుకే అనిపిస్తుంది చూడబడేదంతా వినబడేదిగా మారితే ఎంత ఆహ్లాదంగా వుంటుందో అని!

లయ అనేది రసానుభూతిని కలిగించే వాటిలో ప్రధానమైంది. రూపంలో కంటే నాదంలో లయ ఎక్కువ బలీయంగా వుంటుంది. అందుకే రూపం కంటే నాదం హృదయాన్ని గాఢతరంగా కదిలిస్తుంది. రూపాన్ని వాయుతరంగాల్లోకి మార్చటం కష్టం, నాదాన్ని సులభం, రూపాన్ని కాంతితరంగాల్లోకి మార్చటం సులభం, కాంతి సంబంధమైంది రూపం, వాయు సంబంధమైంది నాదం. కాంతి లేకపోయినా కొంత సమయమైనా జీవించవచ్చు కాని వాయువులేంది ఆ కొంత సమయం కూడ జీవించటం అసంభవం. అందుకే కాంతి బద్ధమైన రూపానికంటే, వాయుబద్ధమైన నాదం ఎక్కువ ప్రాణమయమైంది. 'ఏది ఎక్కువ ప్రాణమయమో అది ఎక్కువ ఆనందమయం కూడ

శ్రవ్యం ఎక్కువ ఆనందమయం కనుకనే అనిపిస్తుంది, కనిపించే దృశ్య సౌందర్యం అంతా వినిపించే శ్రవ్యమాధురిగా మారితే ఎంత బాగుండునో అని!

కొందరు తమ అతీంద్రియ సాధనలో దృశ్య పథాన్ని అనుసరిస్తే మరి కొందరు శ్రవ్యపథాన్ని అనుసరించారు. ఒకటి రూపార్చన అయితే రెండవది నాదార్చన. శ్రద్ధాసక్తులు సక్రమంగా నడిస్తే రెండూ మహనీయమైనవే; సక్రమంగా లేనపుడు రెండూ కావు మహనీయాలు. సాధన సక్రమంగా లేనపుడు రూపసురభి నశించి పోతుంది, శ్రవ్యమాధురి మాధుర్యాన్ని కోల్పోతుంది. అయినా, శ్రవ్యమాధురి మిన్న.

